

అర్ధనారీశ్వర (మహాబలిపురం) విగ్రహం

ఫొటో జి. రామమూర్తి.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder K. NAGESWARA RAO

సంపుటము 40
సంచిక 24
15-2-56

మన్మథ మాఘ శుద్ధ చతుర్థి బుధవారం



బెంగుళూరులో సమితి ఆసియా ఆర్థిక సంఘ సమావేశానికి శ్రీ నెహ్రూ ఫిబ్రవరి 2 నాడు ప్రారంభోపన్యాసం ఇచ్చారు ముందు వరసలో, సమితి ఉపకార్యదర్శి శ్రీ ఫిలిప్ డిసేన్స్, మైసూరు ముఖ్యమంత్రి శ్రీ హనుమంతయ్య, భారత వాణిజ్యపరిశ్రమలమంత్రి శ్రీ కృష్ణమాచారి, సమితి కార్యదర్శి శ్రీ హామర్ షెల్డ్, అధ్యక్షుడు శ్రీ అబ్బాస్ ఖలీలి, శ్రీ నెహ్రూ, మైసూరు రాజప్రముఖ్, మద్రాసు గవర్నరు శ్రీ శ్రీ ప్రకాశ, సంఘకార్యదర్శి శ్రీ లోకనాథన్.

# న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ
(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

జాతికి స్వతస్సిద్ధమైన లక్షణాలు ఉన్నట్టుండి మారమంటే మారవు పై పరిస్థితు లెన్ని మారినా లోపలి స్వభావాలు అంత త్వరగా మార్పు చెందవు ఫజులాలీ సంఘ నివేదికపై భారత ప్రభుత్వం చేసిన నిర్ణయం వెలువడిన తర్వాత బొంబాయి, కటక్ నగరాలలో జరిగిన సంఘటనలనుబట్టి భారతీయులలో తమ కుటుంబం, తమ తెగ, తమ మతం అనే సంకుచితభావా లెంత లోతుగా పాదుకొనివున్నాయో వ్యక్తమవుతోంది జాతి శ్రేయస్సు, దేశక్షేమం అనే వాటిపై తగినంతగా మనలో బాధ్యతా భావం లేదని స్పష్టమవుతోంది సమష్టి శ్రేయోభావము, ప్రజాస్వామ్య విధానంపై శ్రద్ధాభావము మనలో లేదని విదితమవుతోంది మహారాష్ట్రులు రష్యన్లతో సహజీవనం సాగించడానికి సిద్ధంగా ఉన్నారు గాని గుజరాతీలతో సఖ్యంగా ఉండలేరని తేటతెల్లమైంది బొంబాయి సంఘటనల మూలంగా మహారాష్ట్రులను ఇతరులు ఇక మీద నమ్మడానికి వీల్లేదనే భావం ఏర్పడిపోయింది భారతీయులు ఒక జాతివారు కారని ఇదివరలో బ్రిటిష్‌వారు అంటూ వచ్చినమాట ఋజువైనట్లు కనిపిస్తుంది. భారతభూమిలో జాతీయత, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వేళ్లూనలేదనికూడా ఋజువైంది

బ్రిటిష్‌మార్కు ప్రజాస్వామ్యానికి భారతదేశంలో ఎంతవరకూ అవకాశంఉంది

అనే విషయమైనా సందేహాలు కలుగుతున్నాయి. దేశం బాగా సంపదలతో తులతూగుతున్నప్పుడు, ప్రజలలో ఎక్కువ మంది పారిశ్రామిక వ్యాపారంలో పాల్గొంటున్నప్పుడు ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది. కాని మన దేశం ప్రధానంగా వ్యవసాయిక దేశం. ప్రజా స్వామ్యంలో అంతిమ నిర్ణయాలంటూ ఉండవని శ్రీ గాడ్గిల్ నిర్వచించారు. అందుచేత బ్రిటిష్ మార్కు ప్రజాస్వామ్యం మనకు తగినదో కాదో తిరిగి ఆలోచించుకోవాలి. అది తగినది కాకపోతే, మరి ఏ వ్యవస్థ తగిఉంటుందో కూడా నిర్ణయించుకోవాలి.

ప్రజాస్వామ్యంలో శాశ్వత నిర్ణయాలంటూ ఉండవనే మాట నిజమే. కాని ఒకసారి ప్రజాస్వామిక పద్ధతిలో నిర్ణయం జరిగిన తరవాత దానిని మన్నించాలి. తన నిర్ణయాలను తానే మన్నించలేని ప్రభుత్వం తన సమాధి తానే కట్టుకున్నట్లు అవుతుంది. చేసిన నిర్ణయాలను అమలు జరిపే సమర్థత లేనప్పుడు ప్రజాస్వామ్యం అసాధ్య మవుతుంది. మహారాష్ట్రులు కోరే వాటిని తీర్చడానికి ప్రజాస్వామికంగా ఎంత చేయడానికి వీలవుతుందో అంతా చేసిన తర్వాత కూడా భారత ప్రధాని నెహ్రూను మహారాష్ట్ర నాయకులు ఏవిధంగా తోసి రాజన్నదీ ఆయన బయటపెట్టడం మంచిది. మహారాష్ట్రులు తమ చర్యలవలన మాస్టర్ తారాసింగ్‌కు, ఆయన అకాలీదళానికి పరోక్షంగా చాలా సహాయం చేసినవారయారు. బెంగాల్ బీహార్ కలయిక వంటివానిని ప్రోత్సహించాలని ఒక వంక ప్రధాని ప్రయత్నిస్తూ ఉంటే, మరోవంక మాస్టర్ తారాసింగ్ సిక్కుస్థాన్ ఇచ్చితీరాలని పట్టుబడుతున్నారు.

## పూరీ రైల్వేస్టేషను

ధ్వంసం చేయబడిన పూరీ రైల్వేస్టేషనును మరమ్మత్తు చేయకుండా అట్టేపెట్టాలని భారత ప్రభుత్వం నిశ్చయించినట్లు వార్త వెలువడింది. ఒరిస్సాలోని రౌడీలకు ఇది ఏవిధంగా గుణపాఠం నేర్పుతుందో, ఏవిధంగా వారికి రాజ్యాంగసమ్మత పద్ధతుల మైన భక్తిని కలిగిస్తుందో తెలియడం లేదు. దీనివలన నష్టపడేది మామూలు ప్రజలు. రౌడీలను దారికి తీసుకురావడానికి వారిని శిక్షించడం మార్గంగాని ఇది కాదు.

వాల్టర్ లిప్మన్ ఒకచోట ఇలా వ్రాశాడు. "ప్రజాస్వామ్య మార్గం చాలా కఠినమైనది. అమెరికాలో ప్రజాస్వామిక ప్రభుత్వం సమర్థంగా శాసనాలను అమలు చేయడం ఇప్పుడు చాలా అవసరం. అమలు జరిగేట్లు చూడటం అమెరికన్ ప్రజల ముఖ్య కర్తవ్యం." భారత దేశంలో కూడా ప్రజాస్వామిక ప్రభుత్వం సమర్థంగా వ్యవహరించేట్లు చేయడం ప్రజలందరి విధ్యుక్త ధర్మం.

## రాజ్యాంగం-రాష్ట్రపతి

భారత రాజ్యాంగం ప్రకారం, రాష్ట్రపతి తన స్వంత అభిప్రాయాలు వెలిబుచ్చడానికి వీలు లేదట. కేంద్ర విద్యాశాఖ తనను సమర్థించడానికి చేసిన వాదం ఇది అయితే ఒక సంగతి. రాజ్యాంగం ఆదేశాలు రాష్ట్రపతిలాగే కేంద్ర విద్యామంత్రికికూడా శిరోధార్యాలు. రాజ్యాంగానికి బద్ధులమై ఉంటామని ఆయనా ఈయనా కూడా సంతకాలు చేశారు. ఇపుడు రాష్ట్రపతి భావ ప్రకటనా స్వాతంత్ర్యం గురించి రాజ్యాంగం ఏం చెప్పింది ఏం చెప్పలేదూ అన్న విషయం అలా ఉంచగా, విద్యాశాఖ గురించి ఏం చెప్పిందో ఆలోచించాలి. ప్రాథమిక మాధ్యమిక విశ్వవిద్యాలయ విద్యా వ్యాప్తికి, రాజ్యాంగంలో ఏ అధికరణం ఆసరా చేసుకొని కేంద్రం భారీగా డబ్బు ఖర్చు పెడుతున్నది అన్న ప్రశ్నకు జవాబు తేలాలి. ఉపాధ్యాయుల జీతాలకు కేంద్రప్రభుత్వం సబ్సిడీలు ఇవ్వాలని రాజ్యాంగం చెప్పిందా?

## బిరుదు లిచ్చేది ఎందుకు?

బిరుదుల జాబితాను తయారుచేసి, రాష్ట్రపతికి వాటిని సిఫార్సు చేయడంలో ఒక విధంగా పెద్ద పొరపాటొకటి జరిగిందని పిస్తుంది. ఈ సిఫార్సులమేరకు, రాష్ట్రపతి మొన్న ఒక దంతవైద్యుడికి 'కర్నల్' బిరుదు యిచ్చి గౌరవించారు. ఈ సంగతి ప్రకటించబడడంతో ఒక చిన్న దుమారం వంటిది రేగింది. సివిలియనులకు ఇటువంటి బిరుదులు ఇవ్వడం, గౌరవ వైద్యులంటూ కొందరిని ఏరి గౌరవించడం, బ్రిటిష్ కాయాంలో మొదలై, నేటికీ మిగిలిపోయిన ఆచారం. అయితే, ఈ తరహా ఆచారంలో బ్రిటిష్‌వారికి కూడా ఒక పద్ధతి వుంది. వైద్యవృత్తిలో ఉన్నవారు స్వంతానికి ప్రచారం చేసుకోవడం నిషిద్ధం. అందువల్ల గౌరవ వైద్యుల్ని నియమించినపుడు, ఆయా వ్యక్తులకు అప్పటికే దేశవ్యాప్తంగా మంచి పేరుప్రతిష్ఠలు ఉన్నాయా లేదా అని ముందుగా విచారిస్తారు. ఎందుకంటే, ఒకానొక వైద్యునికి, అమాంతంగా కోటివైద్యులను మించిపోయేటట్లు, ప్రతిష్ఠను ఆపాదించి పెట్టడం దీని లక్ష్యం కాదు. మొత్తానికి, సర్వసైన్యాధ్యక్షునికి వైద్యసేవలు సమర్పించే వారికి విధిగా ఇచ్చే ఈ బిరుదు విషయం గమనించవలసి ఉంటుంది. ఇప్పుడు కొందరు దంతవైద్యులను గౌరవ దంతవైద్యులనూ రాష్ట్రపతికి గౌరవ వైద్యులుగా నియమించడం జరిగింది. ఇపుడు కర్నల్ బిరుదుప్రదానం హద్దుని మించిపోయింది. ఈ బిరుదు ఇవ్వడం అంటే, సైనిక దళాల క్రమశిక్షణతో మెలగాటం అనడం అన్నమాట. ఎందుకంటే, ఈ కర్నల్ బిరుదుగల వ్యక్తి సైనిక దళంలో వారికి ఎక్కడైనా, ఎప్పుడైనా ఎదురుపడితే, ఈ హోదాకు తక్కువ అయిన ప్రతి సైనికోద్యోగి, వెంటనే ఆగి, వందనం చెయ్యాలి. సైనికోద్యోగులు, తమ ప్రవర్తన విషయంలో బహు జాగ్రత్తగా ఉండి, విధులను తు. చ. తప్పకుండా పాటిస్తారు. ఇప్పుడు ఈ కొత్త నిర్ణయం సంగతి వినగానే, రక్షణ దళంలో చాలమంది నిరసన వెలిబుచ్చుతున్నారు. గౌరవ వైద్యులంటూ కొందరిని నియమించడం ఎవరికీ ఇబ్బంది ఉండకపోవచ్చుగాని, ఈ కర్నల్ బిరుదు ప్రదానం మాత్రం ఇబ్బందే. ఇదంతా ఆలోచించగా, ఎవరో ఈ సిఫార్సులలో తప్పటడుగు వేశారనిపిస్తుంది.

* * *

## బ్రిటన్ సాంకేతిక సహాయం

కొలంబోపథకం సాంకేతిక సహాయ కార్యక్రమం క్రింద బ్రిటన్‌లో సాంకేతిక శిక్షణ పొందదలచిన వెయ్యవ వ్యక్తి గతవారమే ఆ దేశం వెళ్ళాడు. ఆయన టాటా ఉక్కు కర్మాగారంలో పనిచేస్తున్న శ్రీ బి. పి. సింగ్. గ్లాసోలోని కోక్ ఇనుము పరిశ్రమలోనూ, మాదర్‌వెల్‌లోని కాల్విర్ కర్మాగారంలోనూ శ్రీ సింగ్ ఆరు మాసాలు వుండి ఇనుము కరగించే భారీ కొలిమిలను ఉపయోగించడం మొదలయిన వాటిలో శిక్షణ పొందుతారు. ఆ పైన, బ్రిటన్‌లోని పెద్ద పెద్ద ఉక్కు కర్మాగారాలన్నీ చూచివస్తారు.

## ఉక్కు ఉత్పత్తి లక్ష్యం

రెండవ పంచవర్ష ప్రణాళిక ముగిసేనాటికి సాలుకు 60 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి చేయగలగాలని భారత ప్రభుత్వం నిశ్చయించారు. ఈ మేరకు జెంషెడ్‌పూర్‌లోని టాటా ఉక్కు కర్మాగారం ఉత్పత్తి సాలుకు 20లక్షలటన్నులకు (అంటే రెట్టింపు) పెంచ నిశ్చయించారు. ఇందుకోసం పోత పోసే యంత్రాలు రెండు తెప్పిస్తున్నారు. ఇవి రోజుకు రెండు వేల టన్నుల ముంగలు పోతపోస్తాయి. ఇవికాక, 28 అడుగుల కొలిమి ఒకటి తెప్పిస్తున్నారు. ఈ కొత్త యంత్రాలకు 490 లక్షల పౌండ్లవరకూ ఖర్చు కేటాయించారు. బ్రిటన్‌లో శిక్షణకు వెళ్ళిన శ్రీ సింగ్ ఈ యంత్రాలను నడపడం ప్రత్యేకం నేర్చుకు వస్తారు. ★

# హిడింబ పరిహాసం

## ప్రాచీన గాథాలహరి

ఆ బ్రాహ్మణకుటుంబంలోని వారంతా తమ మునిపల్లెనించి వేరొక మునిపల్లెకు ప్రయాణమైనారు. ఆ అరణ్యమార్గంలో అలజడి ఏమీ లేకుండా సుఖంగా సాగిపోతున్నారు. వారికామార్గం అంతా సుపరిచితమైనదే! ప్రయాణం చాలా వరకు సంతోషంగానే సాగిపోయింది.

ఆ అరణ్యంలో ప్రాతఃకాలవేళ మేలుకొన్న పక్షులు కలకలరవాలతో వారికి స్వాగతం ఇస్తున్నట్లుగా సందడిచేశాయి. పచ్చికబయళ్లలో ఆడుకుంటున్న నెమళ్ల పింఛాలపై ప్రసరిస్తున్న లేత లేత సూర్యకిరణాలు చిత్ర చిత్రంగా వారికన్నులకు మిరుమిట్లు గొల్పుతున్నాయి. చెట్లకొమ్మలపై పరిగెత్తుకుపోతున్న ఉడతల చిరుకుచ్చులా బంగారు వెలుగుల్లో చిన్న చిన్న మెరుపులు మెరిపించాయి! ఆ అరణ్యం అంతా ప్రశాంతంగా సాగిపోతున్న ఆ కుటుంబంవారినందరినీ అడుగడుగునా పలకరిస్తున్నట్లే స్ఫురించింది.

అయితే వారి సుఖప్రయాణం అలాగ ఎంతోసేపు కొనసాగలేదు! ఝాము ఝామున్నర పొద్దెక్కే సరికి ఎండ కొంచెం చిటచిటలాడడం ప్రారంభించింది. అయినా వారా విషయం అంతగా లెక్కచెయ్యకుండా ఏవో కష్టసుఖాలు మాటలాడుకొంటూ అలాగే సాగిపోతున్నారు.

వారిలో వృద్ధబ్రాహ్మణుడా కుటుంబానికంతటికీ పెద్ద. ఆయనధర్మపత్ని ముసలి పండుముత్తయిదువు. ఆ బ్రాహ్మణుని జ్యేష్ఠకుమారునికింకా కౌమార ప్రాయమే! పదహారేళ్లైనా నిండలేదు. రెండవవానికి ఇంచుమించుగా ఆదే వయస్సు. మూడవ కుమారునికి ఉపనయనం చేసే ఈడు వచ్చింది. ఏడెనిమిది ఏళ్లైనా నిండని ఆ పసివాణ్ణి తల్లి చెయ్యి పట్టుకుని నెమ్మది నెమ్మదిగా నడిపిస్తున్నది. అతడు మధ్య మధ్యన ఆ మహారణ్యంలో కనిపించే చిత్ర విచిత్రాలనుగురించి ఏవేవో వింత వింత ప్రశ్నలడుగుతున్నాడు.

ఇంతలో హఠాత్తుగా వారందరిపైన ఒక పెద్ద ప్రళయం విరుచుకుపడింది! వారి ఎదుట ఒక రాక్షసుడు కాలయముడిలా ప్రత్యక్షమైనాడు! నల్లని జుంజురు వెంట్రుకలు, ఎర్రని కళ్ళు, పురి కోరలలాగ కొనలుదేరినపళ్లు! అతనిని చూడగానే ఆ పసివాడు హడలిపోయి తల్లి మాటున దాక్కున్నాడు. ఆ రాక్షసుడు చూడడానికింకా పదిపదహారేళ్ల యువకునిలాగే కనిపిస్తున్నాడు. అతనిచేతిలోని కరవాలం ఆ లేతఎండలో తోకచుక్కలా తళతళ లాడింది. మొదట అతడు అందరినీ హతమార్చి వెయ్యగలడనే నిశ్చయించారు వారంతా! అందరు ఒకరొకర్ని పొదువుకుని దిగాలుపడిపోయి ఆ ఆపత్తు గడిచి బయటపడడం ఎలాగా అని ఎంతో ఆందోళన పడ్డారు.

ఆ బ్రాహ్మణ కుమారులలో ఒకరిని తన తల్లి ఆహారంకోసం తీసుకు పోవాలనీ అందుకే వారి దారి అడ్డగించి నిలబడ్డాననీ ఆ రాక్షస కుమారుడు పెద్దగా అరిచాడు! ఆ మాటలు విని ఆ పండు ముత్తయిదువ వెంటనే స్పృహ తప్పి నేలమీద పడిపోయింది! శీతలోపచారాలు చెయ్యగా చెయ్యగా తిరిగి అతి కష్టంమీద సేదదేరింది.

ఆ వృద్ధ బ్రాహ్మణునికా ఘోర విపత్తులో దారి, తెన్ను కనపడలేదు! లోలోపల ఉబికి ఉబికి ఉప్పొంగిన అతనిక్రోధం అంతా అశక్తుని కోపంలా అలాగే లోలోపలే అణిగిపోయింది! చిట్టచివరికాయన మనస్సులో ఒక్క ఉపాయం స్ఫురించింది.

తానే ఆరాక్షసికాహారమై పోగలననీ తన కుటుంబం సంరక్షింపబడవలసిందనీ కోరుతూ ఆయన వేయివిధాలుగా ఆ రాక్షస కుమారుణ్ణి బ్రతిమాలుకొన్నాడు.

ఆ రాక్షసుడు చిక్కి శల్యమైపోయిన వృద్ధుడు తనకవసరం లేదని విసిరికొట్టేశాడు! అతడు ఆ ముగ్గురు పుత్రులలోను జ్యేష్ఠుణ్ణి తీసుకుపోతానని గట్టిగా పట్టు పట్టాడు. లేకపోతే ఆ కుమారుల నందరినీ బలాత్కారంగా తీసుకుపోతానని బెదిరించడం మొదలు పెట్టాడు.

దానిమీద ఆ బ్రాహ్మణుడా రాక్షసుని చేతులు పట్టుకుని బ్రతిమాలుకున్నాడు.

"నాయనా! జ్యేష్ఠ పుత్రుడే నా వంశ ప్రతిష్ఠాపకుడు! నా అనంతరం వైదిక కర్మాధికారి కూడా అతడే. నాకిన్ని నీళ్లు వదలవలసినవాడు కూడా అతడే!"

ఆ పైన ఆ బ్రాహ్మణుని కంఠం గద్గద స్వరంతో వణికిపోయింది.

రాక్షసునికి ప్రాణం విసిగిపోయింది. తల్లిదండ్రుల ప్రసక్తిలేకుండా కుమారుల నందరినీ బలాత్కారంగా తీసుకుపోయి ఉండవలసిందనీ, ఇప్పుడిక పశ్చాత్తాపపడి ప్రయోజనం లేదనీ అనుకొన్నాడు. తరవాత ఆ బ్రాహ్మణుని కౌగిలిలో అణిగి మణిగి తలదాచుకొన్న జ్యేష్ఠపుత్రుని విడిచివేసి కనిష్ఠ పుత్రుని తీసుకుపోవాలని నిశ్చయించి ఆ రాక్షసుడు వెంటనే అతనిజబ్బ దొరకబుచ్చుకొన్నాడు. ఆ పసివాడు పాపం, తల్లిమాటున తలదాచుకొన్నాడు. తల్లి రాక్షసునితో ఆ పసివానికి బదులుగా తానే అతని తల్లికి ఆహారమైపోతానని అన్నది. కాని అతడు వృద్ధులను తీసుకుపోవడాని కంగీకరించలేదు. పాపం! ఆ వృద్ధమాత అనేకవిధాలుగా ప్రాధేయపడింది. అయితే రాక్షసుడు తన మొండిపట్టు విడువలేదు!

ఇంతలో రెండవ కుమారుడు ధైర్యంగా రాక్షసుని ముందు నిలిచి "వారి నెందుకు బాధిస్తావు; నన్ను తీసుకుపో" అని ముందుకు సాగిపోయాడు. పాపం తల్లి తిరిగీ రాక్షసుని కాళ్లమీద పడి రెండవ కుమారునికి బదులుగా తానే వస్తానని అన్నది. రాక్షసుడు వినిపించుకోలేదు. అతడు, ఆరెండవ కుమారుడు కలిసి నడుస్తూ నాలుగు అడుగులు ముందుకు సాగారు. అదృష్టవశాన ఆ ఆఘాతం

పి. గణపతిశాస్త్రి

ధరించలేక నిలుచున్నపాటుగా అక్కడే స్పృహ తప్పి పడిపోయింది.

బ్రాహ్మణుడా విధంగా రాక్షసునితో కలిసి వెళ్లిపోతూన్న రెండవ కుమారుని సమీపించి అతన్ని ముద్దు కౌగలించుకొని ఎంతో ఆప్యాయంగా ఇలాగన్నాడు.

"నాయనా! మధ్యమా! నీవు ఎప్పుడు ఎవరికిన్నీ అపకృతి చేసిఉండలేదు. ఎన్నడూ నీ హృదయంలో అటువంటి సంకల్పమే ఉదయించి ఉండలేదు. సమస్త దేవతలు నిన్ను కంటికి రెప్పలా కాపాడగలరు! వారి అనుగ్రహంవల్ల, ఆ గాయత్రీ మాత కరుణాకటాక్షంవల్ల నీకు ఎటువంటి అశుభము కలగనేరదు! నా మాట ఎన్నడు వ్యర్థం కాలేదు. ఆ గాయత్రీమాతను సంస్మరించుకో! తిరిగి క్షేమంగా వచ్చి మమ్మల్ని అందరినీ కలుసుకుంటావులే! క్షేమంగా వెళ్ళిరా నాయనా!"

అని అతన్ని ప్రశాంతంగా సాగనంపి స్పృహతప్పి పడిపోయిన ధర్మపత్నికి పరిచర్య చెయ్యడానికై త్వరగా వెనుకకు మరలిపోయినాడు. అక్కడ మిగిలిన కుమారులిద్దరు ఆమెకు పరిచర్య చేస్తున్నారు.

విధికృతం తలుచుకొని ఆ బ్రాహ్మణుడనేక విధాలుగా దుఃఖించినాడు. అరణ్యవాసం చేస్తూ, ఆ అరణ్యంలో ఏ విధమైన రాక్షసబాధా లేకుండా సంరక్షిస్తున్న పాండవులు అక్కడికి కనతిదూరంలోనే ఉన్నా – తమ కుటుంబాని కటువంటి యాతన తప్ప లేదే అని ఆ బ్రాహ్మణుడనేక విధాలుగా తన దురదృష్టం నిందించుకొన్నాడు. కొంతసేపటి కాయన భార్య తేరుకొంది. తన మధ్యమ కుమారుడావిధంగా కుటుంబ సంరక్షణకై రాక్షసునితో కలిసి వెళ్ళిపోయిన విషయం విని తిరిగి అనేక విధాలుగా ఆక్రోశించింది. ఆమె రోదనం కేవల అరణ్యరోదనమే అయిపోయింది! ఎంతగా కన్ను పొడుచుకొన్నా ఎక్కడా కనుచూపుమేరలో ఆమెకు మధ్య కుమారుడు కనిపించలేదు.

ఆ రాక్షసుడు, ఆ బ్రాహ్మణ కుమారుడు అలాగ కొంతదూరం సాగి పోయే సరికి రెండు యామాలకాలం గడిచిపోయింది. తన తల్లికి భోజనవేళ సమీపించినదని చెప్పి రాక్షసుడా కుమారుణ్ణి కొంతదూరం తొందరగా నడిపించుకుపోయాడు. తరవాత ఆ బ్రాహ్మణకుమారుడు సమీపంలో కనిపించే కొలనులో స్నానం చేసి, సంధ్యవార్చి, క్షణకాలం గాయత్రీమాత నుపాసించి, శీఘ్రంగానే తిరిగి వచ్చివేస్తానని దానికి అనుమతి ఇవ్వవలసిందనీ కోరుకొన్నాడు. రాక్షసుడది అతని అంతిమాభీష్టంగా గౌరవించి, స్నాన సంధ్యాదులు నిర్వర్తించుకొని త్వరగా తిరిగి రావలిసిందని చెప్పి పంపించాడు.

ఆ కొలను కనుచూపు మేరలోనే కనిపించింది. బ్రాహ్మణకుమారుడా సరస్సులో దిగి స్నానం చేస్తూండడము, అతని జపతపాలు అన్నీ దూరంనించి జాగ్రత్తగా కనిపెడుతూనే ఉన్నాడు రాక్షసుడు.

అలాగ ఒక అరగడియ గడిచిపోయింది. అయినా బ్రాహ్మణ కుమారుడు తిరిగి రాలేదు! ఏమైనాడా అని ఆ రాక్షసుడు తిరిగీ ఆ వైపు పరిశీలించి చూచాడు. ఎందు చేతనో బ్రాహ్మణ కుమారు డక్కడ కనబడలేదు!

అలాగ ఇంకొక అరగడియ కూడా గడిచిపోయింది. రాక్షసు డిక వేచిఉండలేక పోయినాడు. గట్టిగా పిలవాలని అనుకొన్నాడు. కాని అతని పేరేమో తెలియదు. పూర్వం వృద్ధ బ్రాహ్మణు డతన్ని "నాయనా! మధ్యమా!" అని ఆప్యాయంగా సంబోధించిన విషయం అతనికి జ్ఞాపకం వచ్చింది.

వెంటనే "ఓ మధ్యమా!" అని గట్టిగా గొంతెత్తి పిలిచాడు. ఎవరు మారు పలకలేదు. ఆ అరణ్యంలో చుట్టూ ఉన్న కొండగుహలు మాత్రం 'ఓ' అని మారు పలికాయి!

ఒక నిమిషం ఊరుకుని తిరిగీ రాక్షసు డలాగే గట్టిగా "ఓ మధ్యమా!" అని పిలిచాడు. ఎవరు మారు పలకలేదు. గుహా ప్రతిధ్వనులు మాత్రమే వినిపించాయి. రాక్షసుడు తన యావచ్ఛక్తీ వినియోగించి మళ్లీ గట్టిగా "ఓ మధ్యమా!" అని పిలిచాడు. ఈసారి మాత్రం "ఓయ్! ఓయ్! వస్తున్నాను! వస్తున్నాను!" అని ఒక ప్రత్యుత్తరం వినిపించింది.

ఆ అరణ్యంలో పొదరిండ్ల మధ్యనుంచి దారి చేసుకుని ఒక మహాపురుషు డక్కడ ప్రత్యక్షమైనాడు! అతడు ఆజానుబాహువు. మహా బలశాలి. రాక్షస కుమారు డతన్ని చూచి నిర్ఘాంతపోయాడు!

"ఎవరు నీవు!"

"నేనూ మధ్యముడనే! ఆ బ్రాహ్మణ కుమారునికి బదులు నన్ను తీసుకుపో!"

"ఆ మధ్యముడు ఏమైనాడు?"

"ఏమైతే నేమిలే! నేనూ మధ్యముడనే నా! నీతో కూడా నన్ను తీసుకుపో!"

"నీ వా మధ్యముడవు మాత్రం కాదు!"

"నే నబద్ధం చెప్పలేదు! మా అమ్మ సంతానములో నేను మధ్యముడనే!"

"ఆమె నామధేయం?"

"కుంతీదేవి!"

"నీ పేరు?"

"భీమసేనుడు!"

"భీమసేనుడా!" అని ఆ రాక్షసకుమారుడు కొంతసేపటి వరకు అలాగే నిర్ఘాంతపోయాడు! కుంతీదేవి, పంచపాండవులు – భీమసేనుడు ఈ పేరులన్నీ అతని చిన్నతనంలో ఎప్పుడో వినిపించి నట్లే ఉన్నాయి! కాని అతనికా విషయాలంత స్పష్టంగా తెలియవు. వేళ మించిపోతున్న సమయంలో ఇక అవి తెలుసుకోవాలనికూడా ప్రయత్నించలేదు! భీమసేనునికి కూడా ఆ రాక్షసకుమారుని ముఖం చూచాయగా ఎక్కడో చూచినట్టే గుర్తున్నది. కాని అతనికా విషయం స్పష్టంగా గుర్తుకు రాలేదు! రాక్షస కుమారునికేసి అలాగే చూస్తూ నిలబడిపోయినాడు! కొంతసేపటికి ఇలాగ ప్రశ్నించాడు:

"నీ పేరెవరు?"

"ఘటోత్కచుడు."

"ఘటోత్కచుడా!"

"అవును! అలాగ నిర్ఘాంతపోతున్నావేమిటి?"

"ఏమీలేదు గాని మీ అమ్మగారి పేరేమో అడగవచ్చునా?"

"దానికేమి! ఆమె పేరు హిడింబ!"

ఆ మాట వినేసరికి భీమసేను డలాగే నిర్ఘాంతపడిపోయాడు. తరవాత అతని ముఖంలో అనేక సంతోషచ్ఛాయ లుదయించాయి! క్షణకాలంపాటు అతడేమీ అనలేక అలాగే శిలాప్రతిమలా నిలుచున్నాడు. ఘటోత్కచు డతన్ని తొందరపెడుతూ అన్నాడు:

"మా అమ్మగారికి భోజనవేళ మించిపోతూంది! తొందర తొందరగా నడిచిరా!"

"నేను రాను! నీవే లాక్కుపో!" అన్నాడు భీమసేనుడు బింకంగా!

"ఏం?"

"నా యిష్టం!"

"అయితే నిన్ను వదిలిపెట్టను!" అని చెప్పి ఘటోత్కచు డావక్క నేయున్న పెద్ద పెద్ద బండి గురివెంద తీగలతో అతని నడుము చుట్టూ గట్టిగా కట్టి బరాబరా లాగుకు పోవాలని ప్రయత్నించాడు. కాని ఎంత ప్రయత్నించి, కాయశక్తులా లాగినా ఒక్క అడుగు కూడా ముందుకు సాగలేకపోయాడు! ఘటోత్కచునికా

మిట్టమధ్యాహ్నం ఎండలో ముచ్చెమటలు పోశాయి!

భీమసేను డతన్ని ఎత్తి పొడుస్తూ—

"ఇంతేనా నీ శక్తి!" అన్నాడు.

ఘటోత్కచుడు మళ్ళీ బలంగా లాగాడు! ఒక్క అడుగు కూడా ముందుకు సాగలేదు!

"ఏం! ఏమంటావు?" అన్నాడు భీమసేనుడు బింకంగా. ఘటోత్కచుడు తన శక్తి యావత్తూ ఉపయోగించి మళ్ళీ గట్టిగా లాగి, భీమసేనుని బరబరా పదిఅడుగుల దూరం లాగుకుపోయాడు!

భీముడు కొంచెం సంతోషించి "సరే! నే నే వస్తాలే!" అని అతనితో కలిసి అలాగ ఇంకా చాలా దూరం నడిచిపోయాడు. ఘటోత్కచుడు తిరిగి తన బలం అంతా ఉపయోగించి ఇంకా తొందర తొందరగా రథంలాగినట్టుగా లాగుతూ అతనిని తన వెనకాలే తీసుకుపోయాడు

అలాగ ఇంకా కొంత దూరం పోయేసరికి వారికొక పర్వతము, దాని చుట్టూరా పెద్ద పెద్ద చెట్లు కనిపించాయి! ఆ చెట్ల నీడల్లో ఆ ప్రాంతంలో ఎక్కడా ఎండపొడ కూడా ప్రవేశించడం లేదు!

అలాగ ఇంకా కొంచెం దూరం నడిచి వారిద్దరు పర్వతం దొలిచి నిర్మించిన ఒక పెద్ద పర్వతగృహంలో ప్రవేశించారు! ఘటోత్కచుడు తొందరగా గృహం లోపలికి వెళ్ళి తల్లికి తన సాహసకృత్యం నివేదించాడు. భీమసేను డాపర్వతగృహంలో ఒక శిలావేదికమీద కూర్చున్నాడు. క్షణంలో నే ఘటోత్కచుని వెంటపెట్టుకుని హిడింబ అక్కడికి వచ్చివేసింది.

లోపలికి వస్తూనే ఆమె ఎదురుగా తీగలతో సతమతమవుతూన్న భీమసేనుని చూచి పక్కుమని ఒక్క నవ్వు నవ్వి, ఘటోత్కచుని ముంగురులు మునివేళ్లతో దువ్వుతూ, కళ్లు మిలిగా వాల్చి అతనితో ఇలా అన్నది.

"అయ్యో! వ్రతి తండ్రీ! వీరినా నీవు తీసుకువచ్చింది?"

"ఏం! ఎవరీయన?"

"అయ్యో! ఈయన సాక్షాత్తూ దైవతమే కదా!"

"ఎవరికి?"



"నాకు, నీకూను!"

"అంటే!"

"ఈయన నీకు పితృపాదులు!"

"నిజంగా!"

పిమ్మట హిడింబ భీమసేనుని పాదాలు ముట్టి—

"ఆర్యపుత్రులకు నమస్కారం!" అన్నది

దానితో ఘటోత్కచుని అనుమానం తీరిపోయింది! భీము డతన్ని ఆప్యాయంగా దగ్గరకు తీసుకొని కౌగలించుకొన్నాడు! ఘటోత్కచు డాయనకు సాష్టాంగ నమస్కారంచేసి తన అపచారాలు మన్నించవలసిందని వేడుకొన్నాడు.

పిమ్మట ఘటోత్కచుడు హఠాత్తుగా లేచి నిలబడి అడిగాడు: "అమ్మా! మరి ఈపూట మీ భోజనం మాట?"

"అవును సుమా! ఈ ఆనందంలో మరిచేపోయా నే!"

"అయితే ఇప్పుడే వస్తానుండు!" అని ఘటోత్కచుడు ఒక్క అంగలో ద్వారందగ్గరికి పరుగెత్తుకుపోయాడు!

హిడింబ తొందరగా అతని వెంట వెళ్లి—

"నాయనా! ఈపూటకు కంద మూల ఫలాలు చాలులే!" అన్నది. ఘటోత్కచుడు సరే' అని తొందరగా అడవిలోకి వెళ్లిపోయాడు.

హిడింబ తిరిగివచ్చి నెమ్మదిగా భీమసేనుని కెదురుగా శిలా వేదిక మీద కూర్చున్నది. అత డత్యాశ్చర్యంగా ఆమెకేసి చూసి ఇలా అడిగాడు!

"ఏమిటి హిడింబా! ఈ దారుణం!"

హిడింబ మళ్లీ కళ్లు వాల్చి—

"ఈ అరణ్యంలో మీ ధర్మపరిపాలన ఎలాగ సాగుతున్నదో పరిశీలింతామని ఈ ఎత్తు వేశాను!" అన్నది.

"ఆహా! ఈనాడు రాక్షసులే ధర్మపరీక్షకు లైనారే!"

"అవును! మరి మానవులే రాక్షసులైపోయి నప్పుడు గత్యంతరం?"

భీమసేను డా మాటతో మరి నోటమాట లేక స్తంభించిపోయాడు!

"అయితే నా పరిపాలన పరీక్షకేనా ఇదంతా?"

"అవును!"

"ఒకవేళ తప్పి జారి ఆ బ్రాహ్మణ కుటుంబానికి అపచారం జరిగి ఉంటే?"

"మరి పరీక్షలో మీ రోడిపోయారన్నమాటే!"

"ఎంతటి సాహసం! సరేగాని, నీవు వేసిన ఈ ఎత్తువల్ల ఆ బ్రాహ్మణ కుటుంబం ఎంతటి అలజడి పాలైపోయిందో కొంచెమైనా గ్రహించావా?"

"సరేగాని ఈ నాలుగేళ్లనించీ మీదర్శన భాగ్యం కలగక నా కళ్లెలాగ కాయలు కాచాయో గమనించారా!"

భీమసేనుని కప్పుడు తన తప్పిదం తెలిసింది. పొరబాటే అనుకున్నాడు. అయినా హిడింబ అన్న మాటల అంతరార్థం మాత్రం పూర్తిగా అతని కవగాహన కాలేదు. అలాగే ఆశ్చర్యంగా ఆమెకేసి చూసి నెమ్మదిగా అడిగాడు.

"అయితే ఇక్కడికి మారాక గ్రహించావన్నమాట! ఇదంతా కేవలం పరీక్షకోసం కాదన్నమాట!"

"ఆ మాట నానోట అనిపించాలనా మీ ఊహ!"

భీముడు తిరిగి అలాగే కళ్లప్పగించి చూస్తూ మరింతగా ఆశ్చర్యపోయాడు. హిడింబ చెప్పిన ఈ మాటకూడా ఎంతవరకు విశ్వసించాలో అతనికి బోధపడలేదు.

"అయితే హిడింబా! కాకిచేత కబురంపితే నీ పాదాలదగ్గర వాలిఉందు నే! ఎందు కింతటిపని చేయించావు!"

"నా కంతటి దైన్య మేల?"

"సరేగాని పాపం దీనికోసం మన పసివా డెంత శ్రమపడిపోయాడో గమనించావు కాదుగదా!"

"పోనీ ఈ విధంగానైనా వాడిమీద మీ కింతటి జాలి కలిగింది! అదే పదివేలు! ఇన్నాళ్లనించీ వాడినైనా చూడాలని—ఒక్కమారు మీకు తోచలేదు గదా!"

"ఇన్నాళ్లనించీ చూడకపోయినా ఈ వేళతో వాడి దుండుకు చేష్టలన్నీ తెలిసిపోయాయిలే!" అన్నాడు భీమసేనుడు! తరవాత ఎంతో ఆప్యాయంగా ఆమెను దగ్గిరికి తీసుకుని కొంటెగా నవ్వుతూ.—

"ఎంతటి రాక్షస పరిహాసం!" అన్నాడు.

ఆమె "అదిగో! ఘటోత్కచుడు వస్తున్నాడు!" అన్నది అతనిపట్టు విడిపించుకుని.

"అయితే ఈ వేళ నీ నరమాంసాహారం మాట!" అన్నాడు భీముడు.

"అయితే—నేను నరమాంసం తింటున్నాననేనా మీ నమ్మకం!"

"కానినా డింతటి విచిత్ర ప్రవృత్తి కలగడం అసంభవం!"

"అంతేనా మీరు గ్రహించింది!-అయితే సరే! మీరు నా సరసనే ఉన్నారుకదా! ఆ ముచ్చటకూడా నేనే తీర్చుకుంటాను!" అన్నది హిడింబ ఏమీ తొణకకుండా!

భీమసేను డీ ఫలోక్తి అంతరార్థం గ్రహించుకొని విరగబడి నవ్వడం మొదలుపెట్టాడు.

అంతలో ఘటోత్కచుడు తీయ తీయని ఫలాలతోను కందమూలాలతోను అక్కడ, ప్రత్యక్షమైనాడు!






*మన దేశంలో సాలీనా మనిషొక్కంటికి సగటున పదిహేను గజాలకు మించి బట్ట లభించుటలేదు. యిది చాలదు. కాబట్టే 1960 సం॥నాటికి ప్రతి వ్యక్తికీ 22 గజాల బట్టనైనా లభింపచేయుట మన వస్త్రపరిశ్రమ లక్ష్యము.*

**ముప్ఫయేండ్లనాడు తనకు కావలసిన వస్త్రాల నన్నింటిని దిగుమతి చేసుకొన్న భారతదేశము, వస్త్రపరిశ్రమను స్థాపించి నేడు ప్రపంచమందలి పెద్ద పరిశ్రమ లలో ద్వితీయ స్థానము చూరగొన్నది. యీ కీలక పరిశ్రమకు పెట్టిన పెట్టుబడి మూరుకోట్ల రూపాయలు. ఇందు పదిలక్షల మంది పనిచేయుచున్నారు. సాలీనా 500 కోట్ల గజాల బట్ట వుత్పత్తి యగుచున్నది.**

**ఆర్థికాభివృద్ధికి వుక్కు అత్యంత అవసరము. యీ ఆవశ్యకత నెరిగి యున్న తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ వారి వుక్కు వుత్పత్తిని పెంచుటకై విస్తరణ కార్యక్రమములను అమలు పరచుచున్నారు.**

| వుక్కు వుత్పత్తి | | |
|---|---|---|
| 1955 | .... | 10,50,000 టన్నులు |
| 1959 | .... | 20,00,000 టన్నులు |

## దేశాభ్యున్నతికి ప్రయివేటు సంస్థ అవిరామ కృషి

# ది తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ లిమిటెడ్



# గుమాస్తా మరణం



కొందరిని మాట్లాడి పంపేశాక, జనరల్ తల ఎత్తి చెర్వ్యాకోవ్ కేసి చూశాడు.

"సార్. రాత్రి మీకు జ్ఞాపకం ఉందో లేదో... నేను...అదే...మీ...తుమ్మాను... అనుకో ... క్షమించం" ... అని నత్తుతూ, ఏదో చెప్పేశాడు చెర్వ్యాకోవ్.

"అబ్బబ్బ. ఏంగోల వచ్చిపడింది వాయనా. ఛీ ఛీ..."అని తల ఊగిస్తూ విసుక్కుని ఇంకో వ్యక్తికేసి చూసి "ఏమిటి పని?" అని అడిగాడు.

'అబ్బే. చెప్పేది వినిపించుకునే రకమైతేనా? బాగా కోపం పీకదాకా వచ్చేసినట్టుంది. ఇలా వదిలేస్తే ఎలా? పూర్తిగా వివరంగా చెప్పకుండాపోతే బావుంటుందా?' అని చెర్వ్యాకోవ్ ఇంకా అక్కడే కనిపెట్టుకున్నాడు.

వచ్చినవాళ్లందర్నీ పంపేసి జనరల్ ఇంకో గదిలోకి పోతూ ఉండగా చెర్వ్యాకోవ్ వెంటపడి "అయ్యా, నేను చెప్పేది చిత్తగించండి. పశ్చాత్తాపంతో నా హృదయం క్షోభిల్లిపోతోంది. రాత్రినుండీ ఒకటేవిధంగా దహించుకుపోతున్నాను..." అని చెప్పుకుపోతున్నాడు.

"ఇదిగో ఏమిటి నీఉద్దేశం? నాతో వేళాకోళం ఆడదామనుకుంటున్నావా?" అని ధన్‌మని తలుపు వేసి వెళ్లిపోయాడు జనరల్.

"వేళాకోళమా? ఇందులో వేళాకోళం చెయ్యదగినదేముంది? ఈమాత్రం అర్థం చేసుకోలేడూ ఇంతలావు పెద్దమనిషి? సరే, ఇహ నా క్షమాపణలతో ఆయనకు విసుగు కలిగించడం బావుండదు. ఉత్తరంరాసి పడేస్తాను. ఇహ ఆయన మొహం చూడను. చూడనంటే చూడను. అంతే లేకపోతే ఏమిటి మరి?"

అనుకుంటూ ఇంటికి నడిచాడు. కాని ఉత్తరం రాయలేదు. చాలాసేపు తీవ్రంగా, దీర్ఘంగా యోజించాడు. కాని ఏం రాయాలో తెలియలేదు. అందుచేత మర్నాడు మళ్లీ జనరల్ గృహానికి బయలుదేరాడు.

జనరల్ ఏమిటన్నట్టు అతనికేసి చూడగానే మొదలెట్టాడు: "నిన్న మీకు చాలా కష్టంకలిగించాను. వేళాకోళం ఆడాలనే ఉద్దేశం ఏ కోశానా, ఎన్నడూ నాకు కలగలేదంటే నమ్మండి. ఆరోజున తుమ్మి మీకు ఇబ్బందికలిగించినందుకు క్షమాపణచెప్పకోవాలని వచ్చాను. అంతేగాని వేళాకోళానికి కాదు. మిమ్మల్నా? నేను వేళాకోళం చెయ్యడమా? ఎంతమాట! ఎవర్నయినా గానివ్వండి, పరాయివాళ్లని వేళాకోళం చెయ్యడమే పనిగా పెట్టుకుంటే, ఇక మర్యాద, గౌరవం, మంచీ చెడ్డా ఏమన్నా ఉంటాయా? అందులో గొప్పవాళ్లని..."

"ఫో అవతలికి" అని జనరల్ బ్రిజాలోవ్ పట్టరాని ఆగ్రహంతో ఊగిపోతూ అరిచాడు.

భయంతో కొయ్యబారిపోయి చెర్వ్యాకోవ్ "ఏమిటండి?" అన్నాడు.

"ఫోఅవతలికి"అని జనరల్ రెట్టించాడు.

చెర్వ్యాకోవ్‌కు తనహృదయం బద్దలైపోతున్నట్లనిపించింది. అదిరిపోయి, వెనక్కి వెనక్కి అడుగులు వేసుకుంటూ గుమ్మం దాటాడు. వీధిలోకివచ్చి, పిచ్చివాడిలాగ ముందుకు సాగాడు. ప్రాణంలేని బొమ్మలాగ ఎలాగో ఇంటికి చేరుకున్నాడు. సోఫాలో కూలబడి, ఎలా ఉన్నవాడు ఆలాగే, ఆఫీసుదుస్తులు విడవకుండానే ప్రాణాలు విడిచేశాడు.
















# ఈగలు

భోగలాలసత్వంతో మానవుడు పైమరచి, మదించి, పట్టపగ్గాలు లేకుండా పాడైపోతాడని కాబోలు, ఈశ్వరుడు ఇహలోక సౌఖ్యాలతోబాటే ఈతి బాధలను కూడా కలిగించినాడు. వీనివల్ల కలిగే చికాకు ఇంతా అంతా కాదు. అందులో కొన్ని మన నిద్రాహారాల విషయంలోనే అడ్డు తగుల్తూ ఇబ్బందులు కలిగిస్తవి. "మెత్తనైతే నేమిరా, మరి చెత్తనైతే నేమిరా-అందుచేతను పాడు కట్టెను మెత్తనే వేతామురా" అంటూ మేను మెత్తమీదికి చేర్చేసరికి అంతకుముందే అక్కడ హాజరై వుండే మత్కుణం మనతోటి తన మేటి రక్తబాంధవ్యాన్ని వ్యక్తం చేసుకొంటూ, తన కాక్కను కూడా భుక్తం చేసుకుంటుంది. ఇంతకు మించింది ఈగ. "అన్నమైతే నేమిరా-మరి సున్నమైతే నేమిరా-అందుచేతను పాడుపొట్టకు అన్నమే వేతామురా" అంటూ ముద్ద నోటిదగ్గరకు తీసుకుపోయేసరికి అక్కడ వాలి, చేతికూడు నోటికందకుండా చేస్తుంది ఈ ప్రాణి. అందువల్లనే 'ప్రథమకబళే మక్షికాపాతః' అనే వార్త కూడా పుట్టింది. చివరకు తన ప్రాణాన్ని పణంగా ఒడ్డైనా అడ్డం పడి (చచ్చి) వేడి వేడి కాఫీని మన నోళ్ళలోకి వెళ్ళనీకుండా చేస్తుంది ఈగ.

"కదిపితే కందిరీగల పుట్ట" అన్నట్లు పరిశీలించేకొద్దీ పలురకాల ఈగలు-వానిని గూర్చిన వార్తలు తేటతెల్లంగా తెలుసుకో వచ్చును. అటువంటి రకాలలో "జోరీగ" ఒకటి. ఒకానొక జోరీగ తన పేరు మరచిపోయి తటస్థపడినవారినంతా తన పేరు చెప్పమని అడిగింది. అందరూ తమకు తెలియదంటూ మరొకరిని అడగమని సలహాలిచ్చారు. చివరకు గుర్రం మాత్రం "ఇంతేనా! నా చెవిలోని జోరీగవు కావా నీవు" అని పేరు జ్ఞప్తికి తెచ్చింది. కాబట్టి అటువంటి పొరపాట్లేమీ జరగకుండా, "ఇంతింత గాడిదయా" అనే శీర్షిక క్రింద తను క్రోడీకరించిన జాబితాలో వేమన "ఇంటిలోని పోరు-కంటిలోని నలుసు, కాలిలోని ముల్లు చెప్పులోని రాయి" ఇత్యాదులతో చేర్చి "చెవులోని జోరీగ" అని అగ్రసుతో సహా పేర్కొన్నాడు.

"పై బటారం లో లొటారంగా" కాలం గడిపే వారి నిజస్థితి "ఇంట్లో ఈగల మోత, బైట పల్లకీల మోత"గా వుంటుంది. ఎటూ వెళ్ళడానికి వీలులేక సందిగ్ధంలో పడి కొందరు "శ్లేష్మంలో పడ్డ ఈగలాగ" కొట్టుకులాడుతారు. అటువంటి అవస్థనే ఆంగ్లంలో Fly in the Ointment అంటారు. తనలోని కుళ్ళు, కుత్సితం ఎదుటివాడు తటాలున అందరిముందూ బైట పెట్టేసరికి కొందరు ముఖం వేలాడవేస్తారు. అటువంటి ముఖాన్ని వర్ణించే సందర్భంలో అరవంలో "ముగత్తులే ఈ ఆడల్లే" అంటారు. "కత్తివాటు వేస్తే

## చదలవాడ

ముఖంలో నెత్తురుచుక్క లేదు." అనేదే ఆ మాటకు భావార్థం. కాలాన్ని దుర్వినియోగం చేయకుండా సదా పనిపాటల్లో మునిగి తేలేవాడిని As busy as a Bee అని ఆంగ్లంలో తేనెటీగలతో పోలుస్తారు. తద్భిన్నులను ఆ తేనెపట్టుల్లోనే వుండే "సోమరి ఈగలతో" పోలుస్తూ Lazy Drones అంటారు. ఇది గాక తేనెటీగలలో "రాణి ఈగ" అనేది ఒకటుంది. గ్రుడ్లు పెట్టడంతప్ప దీనికి వేరే పని వుండదు. "గ్రుడ్లు పెడుతూ కూర్చోవడం" మనలో కూడా చాలా మందికి మామూలే. అనగా ఏపనీ లేకుండా కాలం వ్యర్థం చేయడం అన్నమాట. "నోట్లో ఈగ పోవడం కూడా తెలియక" కొందరు మొద్దు నిద్ర (బహుశా నోరు తెరుచుకొని) పోతారు. పూర్వపు రాణీవాసాల్లో "జోరుటీగ" జొరబడడానికి కూడా వీలుండేది కాదు.

"ఈగలు కొట్టుకుంటూ కూర్చోవడం" అంటే కూడా పని పాటలు చేయక, కాలం దుర్వినియోగం చేయడం అన్నమాట. అనగా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవడం లాంటిది. అదే భావంతోనే అరవంలోనూ "ఈ ఓట్టురదు" అని వాడుతారు. ఈ "ఈగలు కొట్టుకొంటూ కూర్చోవడం" అన్న ప్రయోగం ఎందుకొచ్చిందో గాని చైనాలో మాత్రం ఈగలు కొట్టి (చంపి) తెచ్చిన వారికి ఇంతో అంతో ప్రతిఫలం ముట్టుతుంది. ప్రభుత్వం ప్రోత్సహించడంవల్ల అక్కడ ఆరోగ్య వారాలు మక్షిక నిర్మూలన దినాలు విరివిగా జరుగుచుండడం మామూలు. ఏతత్సందర్భంలో ఈగలు చంపి తెచ్చిన వారికి పారితోషికాలివ్వడం అక్కడి అలవాటు. మన దేశంలోనూ ఈగలవల్ల వ్యాపించే వ్యాధులను తగ్గించదలచి ఈగలనిర్మూలనం సాగించబోయేటట్లు ఇటీవల వార్తలు రావడం ముదావహం. అనగా ప్రజలమీద "ఈగ వాలనివ్వని" ప్రయత్నాలు జరుగునన్నమాట.

మనం "సీతాకోక చిలుక" అని దేన్ని అంటామో దానికి ఆంగ్లంలో "Butter fly" అని పేరు. Dragon fly అంటే చైనీయులకు భక్తి. శుభ సూచకంగా, పవిత్రతా చిహ్నంగా, రక్షాకరంగా ఈ Dragon fly బొమ్మ వారు ఎక్కడబడితే అక్కడ చిత్రించుకొంటారు. పగటి పూటల్లో ప్రాణాలు తీయడం చాలక రాత్రిళ్లు కూడా కొన్ని ఈగలు దీపాల వెలుతురులో తబ్బిబ్బులు పడుతూ వుంటవి. అవి "గుడ్డి ఈగలు" అని అనడం మామూలు. కొన్ని ప్రాంతస్థులు దోమలను "చీకటీగలు" అంటారు.

"ఈగారిపాళెయం" అనే ఒక గ్రామం కూడా వుంది. కొంత చదువుకొన్న లక్షణాలు కనబరుస్తూ మాట్లాడ దలచినవారు ఆ వూరిని "ఈగావారి పాళెయం" అంటారు. ఈ "ఈగవారు" ఎవరు, వారిపేరిట ఊరు కూడా ఎందుకు వెలసిందన్నది పరిశోధకులు బైట పెట్ట వలసిన విషయం. కాని, ఆ పేరు రావడానికి కనీసం "ఈగవారు" అనే ఇంటి పేరుతో ఎవరైనా గొప్పవారు అక్కడ వుండే వుంటారని తోస్తుంది. "దోమావారు" అనే ఇంటిపేరు నేటికినీ వుంటూన్నప్పుడు "ఈగావారు" కూడా ఎందుకుండకూడదన్నదే పై ఊహకు ఆధారం. కాబట్టి "ఈగవారైనా" "ఈగావారైనా—" మొత్తానికి ఆ వూరికి ముఖ్య పురుషులు తెలుగువారే అన్నది మాత్రం తెలుసుకో వలసిన విషయం.

ప్రాత రికార్డులకు ప్రతులు తయారు చేయడానికి నియోగింపబడిన వ్యక్తి ఒకడు తలవంచుకు తన పని చేసుకుపోతూండి నప్పుడు, కాగితాలమధ్య నలిగి చచ్చి అతు

గుమ్మడి పంట

(ఈ చిత్రమూ, ప్రక్క పేజీలో చిత్రమూ ఇటీవల మద్రాసు, సెంటినరీ హాలులో జరిగిన ఛాయాచిత్ర ప్రదర్శనంలో ప్రదర్శింపబడినవి. ఫొటోలు తీసినవారు. కృష్ణ చైతన్య)

 ## ఈగలు 

చచ్చిపోయిన ఈగ ఒకచోట కనిపించింది. వెంటనే ఆ వ్యక్తి ఒక ఈగను వెంటాడి, వేటాడి చంపి మాతృకలో ఏవాక్యంలో ఏ మాటకు దగ్గరగా ఈగ కనిపించిందో అక్కడే చంపిన ఈగను కూడా తను తయారు చేసిన ప్రతికి అంటించి True Copy అనే పేరును అక్షరాలా నిజం చేశాడు ఆనాటి నుండి "ఈ అడిచ్చాన్ కాపీ" అనే మాట సామెతగా పరిణమించి ఆ భాషకు అలంకార ప్రాయమై పోయింది

ఒక తెలుగువాడు ఒక తమిళ గృహస్థు ఇంటికి వెళ్ళి "ఈ మాట అట్ట పడివుణ్ణి" న్నన్నా కు-తనకు తలదాచుకోవడానికి తావు చిక్కిన తర్వాత తీసుకుపోవచ్చునని తలంపుతో పాపం వాడి అభిప్రాయంలో తప్పు లేకున్నా ఆ తమిళ వ్యక్తి, "ఈ" అంటే ఈగ అని, "మాట" అంటే నల్లి అని, "అట్ట" అంటే జలగ అని, "పడివుణ్ణి" అంటే పైకుపిడుజాలు అని అపార్థం చేసుకొని ఆ మాట ససేమిరా దింపడానికి వీలు లేదంటూ తెలుగువాడి నెత్తిమీదనే పెట్టి పంపేశాడు కారణం విపరీతార్థం చేసుకోవడం తప్ప మరేమీ లేదు ఈ రీతిగానే హృదయాలు అర్థం చేసుకోక ఎడర్థం పెడర్థాలతో వుండినందువల్లనే చివరకు తెలుగువారు నెత్తి కెత్తుకొన్న మూటా ముల్లె కష్టంతో కర్నూలుకు తీసుకుపోవలసి వచ్చిందేమో

ఒక విధంగా వుంటూనే ఒక్కొక్క భాషలో ఒక్కొక్క అర్థం కలిగించి, అందువల్ల అపార్థం చేసుకోవడానికి దోహదం కలిగించే మారుమూల మాటలకన్నా ఎక్కువగా అన్ని భాషల్లోనూ ఒకే అర్థం ఇచ్చే పదాలే ఎక్కువగా నున్నవి అవన్నీ పండితులు పరిశోధించి ప్రజలముందు పెట్టి భాషా వైషమ్యాలు పోగొట్టడానికి ప్రయత్నిస్తేనే, "చెయ్యి పట్టాల్ పట్టుకొని— దేశీయులంతా నడవవలెనోయ్ — అన్నదమ్ముల వలెను జాతులు—మతములన్నీ మెలగవలెనోయ్" అన్న గురజాడ వారి లక్ష్యం సిద్ధించడానికి వీలు కలుగుతుంది సాహిత్యంయొక్క సత్ప్రయోజనం కూడా అదే 

---

**సవరణ**

గతవారం సంచికలో ఆట్టు మొదటి కవరుపేజీలో ఫొటో తీసినవారు శ్రీ పి రామారావు, రెండవ కవరు పేజీలో ఫొటో తీసినవారు శ్రీ పి గురుమూర్తి అని గ్రహించ ప్రార్థన —సం॥

డిటెక్టివ్ సీరియల్

# అపూర్వ హంతకులు

మూలం: ఎడ్గార్ వాలెస్ అనువాదం: 'వినాయక'

## 9
## మార్క్స్ దురాశ

డిటెక్టివ్ సూపర్నెంట్ ఫాల్‌మాత్ మార్క్స్ చొక్కా కాలర్ పట్టుకుని పిల్లిపిల్లని గుంజినట్లు పడ గుంజేశాడు! "దగుల్బాజీ గాడిదా! ఆ నలుగురు హంతకులోను ఒకణ్ణి నీ గుప్పెట్లో పెట్టుకుని — తీరా నేనడిగితే వాడి మొహం కూడా చూడలేదంటావా? చూడు నిన్నేంజేస్తానో!"

మార్క్స్ అతనిపట్టుతప్పించుకున్నాడు. రుసరుసలాడుతూ ఇలాగన్నాడు:

"నేనా ఆసామీ ఏమైనా హంతకుడని కలగన్నానా? సార్! ఏమిటీదురన్యాయం!" అన్నాడు. తరువాత గమ్మత్తుగా కన్నుగీటాడు. ఇప్పుడు బిల్లీమార్క్స్ బుఱ్ఱ గబగబా పనిజేయసాగం మొదలు పెట్టింది! ఇందొకటినుంచీ తనకేదో దురవస్థ పట్టిందని దిగులుపడ్డాడు గాని ఇప్పటి పరిస్థితులనుబట్టి ఇందులోంచి ఏదో లాభసాటిబేరం లాగవచ్చునని ఎత్తువేశాడు.

"వాళ్లని నేను తిన్నగా చూడనైనా చూడలేదు సార్!" అన్నాడు.

"వాళ్లంటే ఎంత మంది?" ఉరిమాడు డిటెక్టివ్.

"ఎంత మందైతే ఏమిటి సార్!" అన్నాడు బిల్లీ మార్క్స్.

డిటెక్టివ్ కొంచెం వ్యవహారంలోకి దిగి ఇలాగన్నాడు:

"ఇదిగో! బిల్లీ! నేను వ్యవహారధోరణిలో మాట్లాడుతున్నాను. నీకు తెలిసిందంతా నా ఎదట కక్కెయ్యాలి!"

"ఆహా! అలాగా! తెలిసిందంతా కక్కెయ్యాలా? ఇష్టంలేని మనిషిచేత మీరెలాగ చెప్పిస్తారో నేనూ చూస్తానుగా!" అన్నాడు బిల్లీ.

డిటెక్టివ్ ఇక లాభం లేదనుకుని పోలీసు వాళ్ళందరినీ అక్కడనుంచి పంపించివేసి-గొంతు బాగా తగ్గించి ఇలాగన్నాడు:

"నీ తోడుదొంగ హారీ కిందటివారం బైటపడ్డాడు! తెలుసునా?"

"వాడెవడో నాకు తెలియదు సార్!" అన్నాడు బిల్లీ కళ్ళు వాల్చి.

"హారీ తను చేసిన దొంగతనానికి మూడేళ్లపాటు కఠిన నరకం అనుభవించాడు. దానికి వడ్డీ 10 కొరడాదెబ్బలు!" అన్నాడు డిటెక్టివ్.

"అబ్బెబ్బే! వాడెవడోనాకు బొత్తిగా తెలియదు సార్!" అన్నాడు బిల్లీ యథాప్రకారంగా.

**జరిగిన కథ:-**

స్పెయిన్ దేశంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవం జరుగుతున్న రోజుల్లో విప్లవకారులు ఇంగ్లండులో మకాం వేశారు. వాళ్ళని వెళ్ళగొట్టడంకోసం ఆంగ్లదేశమంత్రి పార్లమెంటులో ఒక చట్టం ప్రవేశపెట్టాలని అనుకున్నాడు.

'అపూర్వహంతకులు' ఆ చట్టం ప్రవేశపెడితే చంపివేస్తామని బెదిరిస్తూ ఉత్తరం రాశారు.

తరవాత 'అపూర్వ హంతకులు' లిమిటెడ్ కంపెనీ పేర ఒక పెద్దభవనం అద్దెకు తీసుకుంటారు. దానిలో మాన్‌ఫ్రెడ్ గోన్సాలెజ్ లిద్దరు ఒక మారణపదార్థం తయారు చేస్తారు. పిమ్మట 'బాకా'లో ఒక దురంతం జరిగింది. సంపాదకునికి కూడా ఒక బెదరింపు ఉత్తరం అందింది. ఆ తరవాత థెరీ 'బాకా' కార్యాలయంలో ప్రత్యక్షమైనాడు! అతడు 'అపూర్వహంతకుల' గుట్టు బయటపెట్టేలోగా ఒక ముసుగుమనిషి రివాల్వరుతో అక్కడివారిని బెదిరించి, థెరీని విడిపించుకుపోతాడు. తరవాత హంతకులు మంత్రి హత్యకోసం చెయ్యవలసిన ఏర్పాటులన్నీ చేశారు. ఈలోగా ఒక హంతకుడు పోలీస్ సూపర్నెంటు వేషంతో మంత్రికి ఆఖరి హెచ్చరిక అందజేస్తాడు! ఈ లోగా బిల్లీ మార్క్స్ అపూర్వహంతకుల నోట్ బుక్ కొట్టేస్తాడు. అది పోలీసుల చేతుల్లోపడింది.

తరవాత డిటెక్టివ్ తిరిగి అంటున్నాడు

"ఇంతా చేస్తే పోలీసువాళ్లకి గట్టిరుజువేమీ దొరకలేదు ఏదో ఆదరాబాదరాగా తెలిసినదాన్నిబట్టి అరెస్టుచేశారు అంతే"

బిల్లీ నాలికతో పెదిమలు తడుపుకున్నాడు అంతేగాని ఏమీ మాట్లాడలేదు!

"సరే ఇప్పుడు నీకసలు రుజువు చెప్పినవాళ్లే పని పట్టాలని కాచుకున్నాడు తెలిసిందా?" అన్నాడు డిటెక్టివ్

"సార్! ఈ చెలగాటంవల్ల ఏంలాభం చెప్పండి! ఆ హోరీగాడెవడో నాకేమీ తెలియదు! నన్నెందుకు చంపుతారు!" అన్నాడు బిల్లీ

"పోలీసులిదంతా రుజువు తీసితీరతారు!" అన్నాడు డిటెక్టివ్!

బిల్లీ మాట్లాడలేదు కాని చిట్టచివరి కిలాగన్నాడు

"అయ్యా! నాకు తెలిసిందంతా చెప్పేస్తాను వినండి! మరి నన్నెందుకు చంపుతారు!"

పరవాత బిల్లీ మెల్లిగా గొంతు సవరించుకున్నాక డిటెక్టివ్ "ఇక్కడ కాదు ఇంకోచోటికి పోదాం" అన్నాడు తరవాత అక్కడ నిలుచున్న సార్జంటుతో "బిల్లీని జామీనుమీద విడిచిపెట్టు! నేను జామీనుంటానులే!" అన్నాడు

"అమ్మయ్య, ఇన్నాళ్లకి పోలీసాఫీసర్ నాకు జామీనిచ్చారు!" అని ఎగిరి గంతేశాడు బిల్లీ

ఇంతలో అక్కడికొక మోటారుకారు వచ్చింది సూపర్నెంటు, బిల్లీ కలిసి అందులో కూర్చుని క్షణంలో స్కాట్లండ్ యార్డ్ చేరుకొన్నారు సూపర్నెంటు ఆఫీసులో బిల్లీ తనకథ మొదలుపెట్టాడు

"నువ్వు చెప్పేదేదో తొందరగా చెప్పెయ్యాలి! ఒకక్షణం ఆలస్యం అయితే కొంపలంటుకుంటాయ్!" అన్నాడు సూపర్నెంట్

బిల్లీ తన కథ అంతా చాలావరకు చెప్పేశాడు ఎంత వద్దని చెప్పినా అనవసరమయిన గొడవలు కూడా కొన్ని కలిపాడు జేబుదొంగ చిట్టచివరికి కథ పట్టులోకి వచ్చాడు

"నాకు కనిపించిన వాళ్లిద్దరు ఒకడు పొడుగ్గా గడకర్రలాగున్నాడు ఇంకొకడంతపొడుగ్గా లేడు ఒకతను ఇంకొకనితో "ఇదిగో నేస్తం!" అన్నాడు తరవాత పొడుగాయన పొట్టి ఆయన దగ్గిరనుంచి, ఒకవాచీ, నోట్ బుక్కు తీసుకున్నాడు ఇంతకీ ఆ నోట్ బుక్ లో ఏమైనా ఉందా?" "దానికేంగాని—నీ కథ కానీ!" అన్నాడు డిటెక్టివ్

మళ్లీ బిల్లీ మొదలెటాడు "నేనా వీధి చివరిదాకా వాళ్లని వెంటాడించాను ఇంతలో వాళ్ళొకగుంపులో చిక్కుపడ్డారు అప్పుడే నేనావాచీ సంగ్రహించాను తెలిసిందా!"

"అప్పటి కెంతటయమయింది?"

"పదిన్నరో పదకొండో అయివుంటుంది"

"అయితే ఇంతకీ వాళ్ల మొహాలెలా గున్నాయో చూడలేదన్నమాట!"

బిల్లీ తల అడ్డంగా తిప్పి—అబ్బే నేనున్న చోటినుంచి కదలందే!" అన్నాడు

ఫాల్ మాత్ పెద్దనిట్టూర్పు విడిచి తల వంచుకుని—

"బిల్లీ! నీవల్ల అంతగా ఉపయోగమేమీ ఉన్నట్టు కనపడదు పోనీ వాళ్లకేమైనా గడ్డాలు మీసాలు ఉన్నాయేమో చూశావా!"

బిల్లీ దిగులుగా తల అడ్డంగాతిప్పి ఇల్లాగన్నాడు

"లేదుసార్! ఉన్నమాట చెబుతున్నాను నేనేదో అబద్ధమాడినా నన్నెవరూ పట్టుకోలేరుగా! కాని నాకలాగ చెప్పాలని లేదు మీతో ఉన్నదిఉన్నట్టుగా చెప్పేస్తున్నాను నమ్మినా సరే! నమ్మకపోయినా సరే!"

డిటెక్టివ్ అతను ఉన్నదిఉన్నట్టే మాట్లాడుతున్నాడని గ్రహించుకున్నాడు బిల్లీతో ఇలాగన్నాడు

"బిల్లీ! నీకు తెలిసిందేదో నువ్వు చెప్పేశావు ఇంక నేను చెయ్యగలిగిందేదో చెబుతున్నాను విను అపూర్వహంతకులలో ఒకణ్ణయినా చూసినవాడవు నవ్వొక్కడవే! పైగా వాళ్లని చూసి ప్రాణాలతో బైటపడ్డావు కూడాను! సరే! ఇప్పటికి నీకో మనిషి మొహం జ్ఞాపకం రాకేదనుకో! కాని అతగాడు మళ్లీ నీకెప్పుడైనా ఏ వీధుల్లోనైనా కనబడితే గుర్తుపట్టవచ్చును! అందుచేత ఎల్లుండి పొద్దున్నదాకా నిన్ను నా పూచీమీద బెయిలిచ్చి విడుదల చేయిస్తున్నాను ఎలాగో అలాగ మళ్ళీ ఆ ఆసామీ ఎక్కడైనా కనబడతాడేమో చూడు! ఇదిగో నీకో మొహరీ బహుమతీ ఇస్తున్నాను ఇంటికి వెళ్ళి, సుఖంగా భోంచేసి గుర్రుపెట్టి నిద్రపో! తరవాత లండన్ పడమటివైపు పేటల్లో పచార్లుసాగించు!"

అని చెప్పి డిటెక్టివ్ గదిలోపలికి వెళ్లి ఒక కార్డుమీద పది పన్నెండు మాటలు రాశాడు ఆ కార్డు బిల్లీ చేతిలో పెట్టి ఇలాగ చెప్పాడు

"ఇదిగో! ఈ కార్డు జేబులో పెట్టుకో! ఎక్కడైనా నువ్వు చూసినమనుషులు కనిపిస్తే వెంటనే వాళ్లని వెంటాడించు! పోలీసు ఎవరు కనిపించినా వెంటనే ఈ కార్డు చూపించు! ఆ మనిషిని చూపించు! చాలు! మిగిలినపని అంతా ఆ పోలీసు ముగించేస్తాడు తరవాత ఇంటికి వెళ్లి హాయిమంటూ భోంచేసి సుఖంగా నిద్రపో!"
































## సన్‌లైట్ సబ్బు

బట్టలు చాలకాలము మన్నునట్లు చేయును

భారతదేశంలో తయారుచేయబడినది

# ★ అపూర్వ హంతకులు ★

నిద్ర లేచేసరికి ఆ వెయ్యిపౌనులు బహుమతీఅంతా ఒక్కసారిగా నీ ఒళ్లో పడుతుంది తెలిసిందా!"

బిల్లీ కార్డు తీసుకున్నాడు.

"ఒకవేళ నన్నెప్పుడైనా కలుసుకోవాలంటే ఇక్కడికి రా! గుడ్ నైట్!"

బిల్లీ ఆ కార్డు జేబులో పెట్టుకుని వీథులో పడ్డాడు. అతని తలలో బొంగరాలు గిరగిరా తిరిగాయి!

మహత్తర సంఘటనలు జరగవలసిన ఆనాటి ప్రాతః కాలవేళ లండన్ నగరంలో సూర్యకాంతులు కళ్లు జిగేల్ మనేటట్లు తళతళా మెరిశాయి!

మాన్‌ఫ్రెడ్ రాత్రి తెల్లవార్లు తన వర్క్‌షాపులో కూచుని ఏదోపని చేస్తూనే ఉన్నాడు. అతడలాగ పనిలో మునిగి తేలుతూంటే ఠక్కున తెల్లవారింది! మాన్‌ఫ్రెడ్ పై డాబామీదనించి కళ్లారా ఆదృశ్యం తిలకించాడు

అతనొక రగ్గుమీద బోర్లాపడుకున్నాడు. పొద్దుటి వెలుగులో అతని మొహం బాగా దిగులుగా కనబడింది. గడ్డంలో అక్కడక్కడ నెరిసిన వెంట్రుకలా వెలుగులో తళతళా మెరుస్తున్నాయి!

ఎందుచేతనో బాగా అలిసిపోయాడు అతడలాగ నిస్త్రాణగా కనబడడం ఒక పెద్ద వింతే!

గోన్నాలెజ్ మెల్లిగా ఆ డాబాతలుపు తెరుచుకుని పైకి వచ్చాడు మాన్‌ఫ్రెడ్ ధోరణి చూసి చాలా ఆశ్చర్యపడ్డాడు దగ్గరికి వచ్చి మెల్లిగా అతని భుజం మీద తట్టాడు.

"ఇలాగ నిస్త్రాణ ఉన్నావేమిటి?" మెల్లిగా అడిగాడు గోన్నాలెజ్

మాన్‌ఫ్రెడ్ ఒక చిరునవ్వు నవ్వి ఆదేమీ లేనట్టు తల ఊపాడు అయినా గోన్నాలెజ్ తన అనుమానం తీరక—

"ఆ దొంగనిగురించేనా నీ వింతగా కంగారు పడడం?"

"అవును!, ఆ దొంగనుగురించీ పాయ్‌కార్టును గురించీ కంగారు పడుతున్నాను ఎప్పుడైనా ఎక్కడైనా మనమింతగా దిగులు పడ్డామా?"

వాళ్ళిద్దరు గుసగుసలాడినంత మెల్లిగా మాట్లాడుకున్నారు గోన్నాలెజ్ కొంత గుంభనగా ఇలా గన్నాడు.

"అవును అప్పుడు వార్సాలో వ్యవహారంలో కూడా ఇలాగే ఇబ్బందులు పడ్డాము అప్పుడు కూడా ఇప్పటిలాగే ఇక ఏమీ లేదు! అంతా అయిపోయిందనే అనుకున్నాం."

మాన్‌ఫ్రెడ్ "ఈ వ్యవహారంలో ఇక వెనకంజ వెయ్యడానికి వీలులేదు! ఏమైనా సరే!" అన్నాడు.

తరవాత వాళ్ళిద్దరూ డాబామీదనించి దిగిపోయారు.

"షేరీ ఎక్కడున్నాడు?" అన్నాడు గోన్నాలెజ్.

"గుర్రు పెట్టి నిద్రపోతున్నాడు."

వాళ్ళిద్దరు స్టూడియోలోపలికి వెళ్ళబోతున్నారు. మాన్‌ఫ్రెడ్ స్టూడియో గొళ్లెం తీయబోయాడు. ఇంతలో అడుగుల చప్పుడు వినిపించింది.

"ఎవరక్కడ?" అని గట్టిగా అరిచాడు మాన్‌ఫ్రెడ్. జాయగా ఈల వినిపించింది. ఎదురుగా పాయ్‌కార్ట్ ప్రత్యక్షమైనాడు అతనిగడ్డం బాగా మాసింది. మొహం అంతా డొక్కుపోయింది.

"ఇదేమిటీ వేషం!" అన్నాడు మాన్‌ఫ్రెడ్ అదిరిపడుతూ.

"పైకి వెడదాం పదండి!" అన్నాడు పాయ్‌కార్ట్ ముక్తసరిగా. తరవాత ఆ ముగ్గురు మెట్లెక్కి పై అంతస్థు గదిలోకి వెళ్ళారు వారిలో ఎవరూ ఏమీ మాట్లాడలేదు

గదిలోకి వెళ్లగానే పాయ్‌కార్ట్ హాట్ ఒకమూలకి విసిరివేసి ఒకకుర్చీలో కూలబడి తనకథ మొదలుపెట్టాడు.

"మనకి ఎక్కడికి వెళ్ళినా చుక్కెదురౌతూంది నా నోట్‌బుక్ కొట్టేసిన జేబుదొంగని పోలీసువాళ్లు అరెస్టుచేశారు ఆ నాడా జేబుదొంగ పోలీసు నిర్బంధంలో ఉన్నాడు వాడొక సామాన్యం జేబుదొంగ! వాళ్లా నోట్‌బుక్ వాడిదగ్గర పట్టుకున్నారు. అది అంతటితో వదలిపోయేదే! కాని ఒక అసాధ్యుడది మనరాతే అయివుంటుందని పసిగట్టాడు.

నేను మీదగ్గరనించి వెడుతూ నేడౌనింగ్ స్ట్రీట్ చేరుకున్నాను అక్కడ చేరినగుంపులో కలిసిపోయిన కొంతసేపటిదాకా ఆ తమాషా చూశాను ఫాల్‌మాత్ అక్కడే ఉన్నాడనీ, ఏదయినా కొత్తసంగతి తెలిసే వెంటనే అది డౌనింగ్ స్ట్రీట్‌కు తెలియజేస్తారనీ నేనింతకుపూర్వమే ఊహించాను. సరిగా అలాగే జరిగింది ఆ దొంగ సామాన్యం జేబుదొంగే అయి ఉంటాడని నేను మొదటే ఊహించాను ఒకవేళ ఏదయినా ప్రమాదం అంటూ జరిగితే- మనల్ని హఠాత్తుగా అరెస్టుచెయ్యడమే జరుగుతుందని అనుకున్నాను అంతే! నేనలాగ అక్కడ నిలబడి ఉండగా గబగబా అక్కడికొక గుర్రబ్బగ్గీ వచ్చింది. అందులోనించి అతి కంగారుగా ఒకమనిషి కిందికి దూకాడు అతడొక పోలీసాఫీసర్! అనుమానమేమీ లేదు ఇంతలో ఫాల్‌మాత్ ఆ ఆఫీసరుతో కలసి కారులో బయలుదేరాడు. నేనొక గుర్రపుబగ్గీ ఎక్కి వాళ్ల వెంట పడ్డాను కాని వాళ్లు నన్ను దాటిపోయారు కాని వాళ్లెక్కడికి వెళుతున్నారో స్పష్టపడిపోయింది నేను బగ్గీ దిగి పోలీసు స్టేషనుదాకా నడిచివెళ్లాను. నేననుకున్నది రైటే! వాళ్ళిద్దరు పోలీసుస్టేషన్‌లో కెళ్లారు. వాళ్ళిద్దరు ఎక్కివచ్చిన కారు పోలీస్ స్టేషను ఎదురుగా నిలబడిఉంది.

తరవాత ఆ ఖైదీ దగ్గరినుంచి కూపీ తియ్యడం మొదలైన తతంగం అంతా ఎక్కడో లోలోపలే జరుగుతుందనుకున్నాను గాని, అదృష్టవశాత్తు అది నాకెదురుగా ఉన్న గదిలోనే జరిగింది నాకెదురుగా ఫాల్‌మాత్, ఆ పోలీసాఫీసరు, ఆ ఖైదీ కనిపించారు! ఆ ఖైదీ అలగా మనిషిలాగే అంతమరీ స్పష్టంగా పట్టుకోలేదుగాని మళ్ళీ కనిపిస్తే మాత్రం తప్పకుండా గుర్తుపట్టగలను.

ఆ క్షణంలో నాకా డిటెక్టివ్ మండిపడడం, ఆ దొంగ తిరగబడడం అన్నీ స్పష్టంగా కనబడ్డాయి! ఆ దొంగతనేమీ ఎరగనట్టు మాట్లాడేస్తున్నాడు!"

ఆమాటవినగానే మాన్‌ఫ్రెడ్ "అమ్మయ్య, బతికి బైటపడ్డామన్నమాటే!" అని ఒక నిట్టూర్పు విడిచిపెట్టాడు

పాయ్‌కార్ట్ మళ్ళీ మొదలుపెట్టాడు:

"అయితే నేను గ్రహించింది నిజమో కాదో నిశ్చయించుకోవాలనుకున్నాను. మళ్ళీ వెనక్కి తిరిగాను ఇంతలో నా వెనకాల కారువస్తూన్న చప్పుడైంది! అందులో నేనుచూసిన వాళ్లిద్దరుకాక ఇంకో మనిషి కూడా ఉన్నాడు ఆదొంగను స్కాట్లండ్ యార్డుకు తీసుకుపోతున్నారని గ్రహించాను! అలాగే వెనక్కి తిరిగివచ్చాను ఆ కొత్తమనిషిని వాళ్ళేంచేస్తారో కనుక్కోవాలనుకుని అలాగే ఆవీథిమొగని నిలబడ్డాను.

"నిన్నరాత్రి మీషాపులో దొంగలుపడ్డారని విన్నాను. చాలా నష్టపోయారా?"

"అవునండీ. చాలా నష్టమైంది కాని మొన్నరాత్రి దొంగలు పడనందుకు సంతోషిస్తున్నాను. ఎందుకంటే నిన్న మధ్యాహ్నంనించే ధరలు సగానికి సగం తగ్గించాం."

★

## ★ అపూర్వహంతకులు ★

కొంతసేపటికా కొత్తమనిషి ఉత్సాహంగా వీధిలోకి తిరిగివచ్చాడు. నేనతన్ని వెంటాడించాను!"

"బహుశా అతన్ని ఆ పోలీసులు కూడా కనిపెట్టి చూస్తూఉండవచ్చును. అది వొక పెద్ద ప్రమాదమే!" అన్నాడు గోన్సాలెజ్ అతి జాగ్రత్తగా.

పాయ్‌కార్ట్ దానికిలాగన్నాడు:

"ఆ విషయం నేనొక కంట కనిపెట్టి చూస్తూనేవున్నాను. నేనే పని చేసినా ముందువెనకలు చూసుకుంటూ అతి జాగ్రత్తగా మసులుకున్నాను. ఆ పోలీసులా దొంగని స్వేచ్ఛగా తిరగనిచ్చారనే అనుకున్నాను. ఆ మనిషి దారి, తెన్ను తెలియనివాడిలాగ అటు ఇటు తచ్చాడుతుంటే మెల్లిగా అతనిదగ్గరికి జేరుకుని అగ్గిపెట్టె అడిగాను. అతడెంతోమార్యాదగా అది నాచేతికందిచ్చాడు. నేను మెల్లిగా అగ్గిపుల్ల వెలిగించాను. ఆ వెలుగులో నా మొహం గుర్తుపట్టడానికి వీలుగా నిలుచున్నాను.

"చాలా తెలివైనపనే!" అన్నాడు మాన్‌ఫ్రెడ్.

పాయ్‌కార్టు ఆంకా అలాగా చెప్పుకుపోయాడు.

"ఆ వెలుగులో అతని మొహం జాగ్రతగా పరకాయించాను అతను నన్నేమీ గుర్తుపట్టినట్టు కనబడలేదు! మెల్లిగా బాతాఖానీలోకి దింపాను.

ఏదో వాతవరణాన్ని గురించీ వార్తాపత్రికల్ని గురించీ బీదవాళ్ళనిగురించీ బాతాఖానీ కొట్టుకుంటూ మెల్లిగా ఒక కాఫీ హోటల్లోకి జేరుకున్నాము. నే నిద్దరికీ కాఫీ ఆర్డరిచ్చాను. కాఫీ వచ్చింది నేనొక మొహిరీతీసి బల్లమీద పెట్టాను. హోటలు యజమానిదగ్గర చిల్లరలేదు

"మీ నేస్తందగ్గిర చిల్లరలేదా?" అన్నాడు.

"ఇంతలో ఆ దొంగ డాబు, దర్పం బైటపడ్డాయి. తనుకూడా జేబులోనించి ఒక మొహిరీ పైకి తీసి "నా దగ్గర ఇదే ఉంది. చిల్లర ఏమీలేదు" అంటూ జేబులు తడిమాడు. ఏదో కొంత చిల్లర బైటపడింది. మనల్ని గురించి అతను పోలీసులతో ఏమేమి చెప్పాడో పట్టుకోవాలని అనుకున్నాను. కాని ఇంతలో ఆ దొంగే నన్ను గుర్తుపట్టి మెల్లిగా బాతాఖానీలోకి దింపుతున్నాడేమోనని భయంవేసింది."

అని చెప్పి పాయ్‌కార్ట్ జేబులోనించి ఒక చిన్న సీసా పైకి తీసి అది అతి జాగ్రత్తగా బల్లమీదపెట్టి ఇలాగన్నాడు.

"ఆ అనుమానం ఏమాత్రం ఎక్కువయినా వెంటనే అతను పైలోకానికి ప్రయాణం కట్టేసి ఉండేవాడే! కాని ఆఅనుమానం కాస్తా తీరిపోయింది మేమిద్దరముకలిసి నడుస్తూంటే ముగురు పోలీసు లెదురయ్యారు. అతనికి నా మీదకనక అనుమానమేఉంటే వెంటనే నన్ను అరెస్టుచేయించి ఉండేవాడేగా!"

తరవాత మే మిద్దరము ఆ కాఫీ హోటలు లోనించి ఇవతలికి వచ్చివేశాం! నేను మెల్లిగా అతన్ని అపూర్వహంతకుల ప్రస్తావనలోకి దింపాను."

అని చెప్పి పాయ్‌కార్టొక చిన్న నవ్వు నవ్వాడు.

మళ్ళీ తన కథ మొదలు పెట్టాడు.

"ఆ దొంగ ఆ వేళ తానుచూసిన గుర్తుల్ని బట్టి మళ్ళీ మనల్ని పట్టుకోవచ్చునని బాగా ఉబలాట పడుతున్నాడు. అందుకనే అతన్ని కొంతకాలందాకా వదిలివేసి ఉంటారని తోస్తుంది. రేపుకూడా అతడు లండనంతా గాలించాలని ఆలోచిస్తున్నాడు.

తరవాత మేమిద్దరం విడిపోయాం. నేనా తరవాత కోవెంట్ గార్డెన్ మార్కెట్ దగ్గర తచ్చాడుతూ ఊరికే ఉత్తపుణ్యానికి హఠాత్తుగా వెనక్కి తిరిగి చూశాను! బిల్లీమార్క్స్ ప్రత్యక్షమైనాడు! నే నడగకుండా అతనే తన కథ మొదలుపెట్టాడు. అదంతా నిజంలాగే కనిపించింది. మళ్లీ ఇంకొకసారి అతన్ని కాఫీకి పిలిచాను. మొట్టమొదట తటపటాయించాడు గాని తరవాత సరే నన్నాడు. కాఫీ వచ్చింది. మార్క్స్ కొంచెం దూరంగా జరిగి కప్పు తన దగ్గిరికి లాక్కున్నాడు. ఆ సమయంలో నన్నతడు గుర్తుపట్టేసినట్టు స్పష్టపడిపోయింది!"

"ఎందుచేత?" అన్నాడు మాన్‌ఫ్రెడ్.

"ఏమైనా నా అభిప్రాయం అది! ఇంతకీ నన్నెందుకు అరెస్టు చేయించలేదో మాత్రం బోధపడలేదు. ఏమంటావు గోన్సాలెజ్!"

గోన్సాలెజ్ దానికి జవాబిచ్చాడు.

"దీనిలో పెద్ద ఆశ్చర్యమేమివుంది! థేరీ మనల్నెందుకు మోసగించలేదు? దురాశ! మన నాగరికతకంతటికీ ఇదేకదా పునాది! ఆ పోలీసులు ప్రకటించిన సొమ్ము తీరా ఇస్తారో ఇవ్వరోనని అతని అనుమానమేమో! ఆరకం మనుషులందరికీ అలాంటి అనుమానాలే ఉంటాయి!"

అని చెప్పి గోన్సాలెజ్ మెల్లిగా గోడదాకా నడిచి వెళ్లాడు. అక్కడ అతని కోటు వేళ్లాడుతూంది. దానికి జాగ్రత్తగా బొత్తాములు పెడుతూ లోలోపల ఏదో ఆలోచించాడు. తరవాత గడ్డం తడుముకున్నాడు. అటుపిమ్మట బల్లమీద ఉన్న ఆ చిన్న సీసా జేబులో పడవేసి—

"అయితే మొత్తం మీద ఆ దొంగని కోకరా తినిపించావన్నమాట!" అన్నాడు.

"అవును!...అతను రెడ్‌క్రాస్ వీధిలో ఒక అద్దెయింట్లో ఉంటున్నాడు. నెంబరు 700.

ఇంతలో గోన్సాలెజ్ ఒక పేపరు తీసుకుని దానిమీద ఒక మనిషి తల చిత్రించి "మార్క్స్ సరీగా ఇలాగే ఉంటాడు కాదూ?" అన్నాడు.

"అవును సరీగా ఇలాగే ఉంటాడు. నువ్వెక్కడైనా చూశావా?"

గోన్సాలెజ్ యాదాలాభంగా "ఆఁ నేనెక్కడా చూడలేదు! కాని అలాంటి మనిషికి సరీగా అలాంటి ముఖకవళికే ఉంటుందని ఊహించాను."

తరవాత గోన్సాలెజ్ గుమ్మంమీద నిలుచున్నాడు.

"ఇందులో కొంత గట్టిగా పనిచెయ్యాలి!" అన్నాడు. నిజానికి ఆమాట అతడు మాన్‌ఫ్రెడ్‌నే ఉద్దేశించి అన్నాడు. మాన్‌ఫ్రెడ్ దండ కట్టుకుని బొమముడి విరిచి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

గోన్సాలెజ్ అన్నమాటకు సమాధానంగా గట్టిగా పిడికిలి బిగించి పైకెత్తాడు!

గోన్సాలెజ్ అది చూసి నెమ్మదిగా అగది లోనించి ఇవతలికి వచ్చివేశాడు.

*     *     *

బిల్లీమార్కన్ ఒక పెద్ద ఇబ్బందిలో పడిపోయాడు. అతడు ఎలాగో అలాగ తానసుమానించిన మనిషిని కనిపెట్టగలిగాడు. కాని క్షణంలో అతగాడు కన్నుగప్పి తప్పించుకొనిపోయాడు. పాయ్‌కార్ట్ ఒక పెద్దహోటలు చూసి ఇప్పుడే వస్తానని చెప్పి అందులో దూరి మాయమైపోయాడు. బిల్లీకి దాంతో మతిపోయింది. ఇది ఇలాగ జరుగుతుందని అతననుకోనేలేదు! పాయ్‌కార్టుని బిల్లీ కొంతదూరంనించే గుర్తుపట్టాడు. తను వాచీ కొట్టేసిన ఆ సామీ అతడేనని నిశ్చయించాడు. ఆ పక్కనే ఉన్న ఒక పోలీసుని పిలిచి వెంటనే అతణ్ణి అరెస్టు చేయించేవాడే! కాని ఆ పోలీసుతో కలిసి ఆ బహుమతిలో భాగం పంచుకోవాలేమోనని అతనికొక అనుమానం బయలుదేరింది! అందుచేతే ఆ పని చెయ్యలేదు! అదీగాక ఇంతా చేస్తే ఆ మనిషి తనువెనుకచూసిన మనిషి అవునో కాదో నన్న అనుమానం కూడా పీడించడం మొదలు పెట్టింది.

పాయ్‌కార్ట్ రసాయన శాస్త్రరహస్యాలన్నీ బాగా తెలిసినమనిషి. రంగు రంగుల మందులు కలుపుతూ ఏవో కొత్త కొత్తవం తయారుచెయ్యడమే అతని వృత్తి! అందుచేత అతనిమో చేతి రంగు వెలవెలబోయింది.

ఈ సంగతి బిల్లీకి బాగా జ్ఞాపకం ఉంది. చిట్టచివరికిదంతా మోసంగా పరిణమిస్తుందనే భయంతో అతడా సంగతి కాస్తా పోలీసులతో చెప్పడం మానేశాడు. తన బహుమతీ అంతా ఇంకొకరితో కలిసి పంచుకోవలసివస్తుందేమోనన్న భయంమూలాన్నే అతడు పాయ్‌కార్ట్‌ను వెంటనే అరెస్టు చేయించలేదు! కాని దానికి అదేమీ అంత పెద్ద కారణంకాదు! దానికి వేరే ఇంకో కారణంకూడా ఉంది. ఒక్క అపూర్వహంతకుణ్ణి పట్టుకుంటేనే వెయ్యిపౌనులిస్తే నలుగురికీ నాలుగువేలపౌనులు చేతులో పడతాయిగదా! బిల్లీ చాలా పెద్ద వ్యవహర్త! ఏదో లాభం ఒళ్ళో పడనిదే ఏపనీ తలపెట్టడు! ప్రతీరోజు చేసే జేబు దొంగతనాల్లో కూడా అవిధంగానే ఆలోచిస్తాడు. ఏదో ఒకేమాదిరి దొంగతనానికి అతనెప్పుడు అంటి పెట్టుకు ఉండలేదు!

ఒకప్పుడు ఒకజేబులో వాచీ కొట్టేస్తాడు ఇంకొకప్పుడొక గల్లాపెట్టె ఖాళీచేస్తాడు. అవసరమయితే చిల్లరమల్లర కాజెయ్యడానికికూడా జంకడు! ఇలాగ ఏదిపడితే అది గుటకాయస్వాహాఅనడమే అతని వృత్తి! అందుచేత పోలీసు దస్త్రాలలో అతనివృత్తి ఫలానాఅని ఎక్కడా నిర్ణయంకాలేదు!

పాయ్‌కార్టు ఆ హోటల్లో అవిధంగా మాయమయ్యేసరికి బిల్లీ "శోకరాతి నేకాం రా!" అనుకొని చటుక్కున పేలుకరుచుకున్నాడు. అయినా ఆ వీథిఅంతా వెతికాడు. కనుచూపు మేరలో ఎక్కడా పోలీసు కనిపించలేదు! ఆ హోటలు వీథిగుమ్మం సందులో పోర్టరొకడు ఇత్తడిసామాను పాలిష్ చేస్తున్నాడు. ఇంకా బాగా తెల్లారలేదు! వీథులో అట్టే జనసంచారం లేదు! చివరికి బిల్లీ తెగించి ఒకదారి తొక్కాడు. సామాన్య పరిస్థితిల్లో అయితే అతడంతటి సాహసంతలపెట్టేవాడుకాదు! అప్పుడిక వేరే మార్గమేమీ లేదు!

తొందరగా వెళ్ళి హోటలుతలుపు తట్టాడు. పోర్టర్ అతన్ని చూడగానే బాగా అనుమానించాడు. ఆ చిరుగుల కోటుచూస్తే ఎలాంటి వాడికైనా అనుమానం బయలుదేరితీరుతుంది ఆ పోర్టర్—

"ఎవరు నువ్వు! ఏం కావాలి?" అన్నాడు.

"ఇదిగో! నేను చెప్పేది కాస్త జాగ్రత్తగా విను!" అన్నాడు ఎంతో ఇదిగా!

కాని పోర్టరతని బుజంమీద చెయ్యేసి శక్తికొద్దీ ఒక్క తోపుతోశాడు! దాంతో బిల్లీ ఎగిరివెళ్ళి వీథులో పడ్డాడు!

"ఫో! అవతలికి ఫో! అన్నాడు పోర్టర్.

ఈ దెబ్బ తగిలేసరికి బిల్లీకి తనసామర్థ్యం కాస్తా ప్రదర్శించాలనే పట్టుదల పుట్టుకొచ్చింది.

తొందరగా దుమ్ము, ధూళిదులుపుకొని కోటు, హేటు, సరుదుకొని ఫాల్‌మాత్ తన కిచ్చిన కార్డు చేత్తో పట్టుకుని, మళ్ళీ గుమ్మం దగ్గరికి వచ్చి ఠీవిగా నిలబడ్డాడు.

"నే నెవర్ననుకున్నావ్! పోలీసాఫీసర్ని తెలుసా! నా డ్యూటీకి అడ్డువచ్చావంటే—చూసుకో నిన్నేంజేస్తానో!"

పోర్టరు కార్డు చేత్తో పట్టుకుని జాగ్రత్తగా పరకాయించాడు. అది చూడగానే అతని ధోరణి మారింది!

"మీకేం కావాలి?" అన్నాడు మర్యాదగా. 'సార్' కూడా జేర్చేవాడే గాని ఎందుచేతో ఆ మాట గుండె గొంతుకులోనే కూరుకుపోయింది! అతగాడు డిటెక్టివే అయి ఉంటాడనీ అందుకనే ఆ మారువేషంలో వచ్చాడనీ అనుకున్నాడా పోర్టర్!

"ఇంతకుపూర్వం ఇక్కడికి వచ్చిన పెద్దమనిషితో మాట్లాడాలి!" అన్నాడు బిల్లీ.

పోర్టర్ తలగోక్కుంటూ.

"ఆయన గదినెంబరెంత?" అన్నాడు.

బిల్లీ గబగబా ఇలాగ చెప్పాడు.

"గదినెంబరేమైతేంలే! ఈ హోటలుకేమైనా పెరటిదారికూడా ఉందా? వీథిగుమ్మంకాక దీనికింకేమైనా దారులుకూడా ఉన్నాయా?" "లేకేం! అరడజను దారులు ఉన్నాయి!"

"వద్దా అరడజనుదారుల్లోను ఏదోదారి దగ్గిరికి తీసుకువెళ్లు!" అని అరిచాడు బిల్లీ!

ఆహోటల్లో సామాన్యంగా వ్యాపారస్థులంతా ఉపయోగించే పెరటిదారి ఒకటి ఉంది. అక్కడికి వెళ్ళేసరికి బిల్లీ అనుకున్నంతపనీ జరిగిపోయింది. అక్కడ పని మనిషి సరీగా బిల్లీ చెప్పిన ఆనవాళ్లున్న ఆసామీ ఒకడు అప్పుడే ఆదారమ్మటే వీథులోకి వెళ్లిపోయాడని చెప్పాడు. ఆ ఆసామి స్ట్రాండ్ వీథికేసివెళ్లి అక్కడ ఒక గుర్రంబగ్గీఎక్కి ఒక్కక్షణంలో మాయమైపోయాడు!

పాపం! కొంచెంచురుగ్గా పనిచేసిఉంటే బిల్లీకా బహుమతి ఒళ్లోపడిఉండును. కాని ఏంలాభం! అతను చాలా ఇదైపోయి, తన దురదృష్టానికి నొచ్చుకుంటూ మళ్లీ యథాప్రకారంగా నడకసాగించాడు అతనికా వేళ జరిగినవన్నీ బుర్రలో తిరిగిపోతున్నాయి. మధ్యమధ్యన తన పొరపాటు తలుచుకుని లోలోపల బాగా దిగులుపడిపోయాడు ఆ మనిషి గుర్తులన్నీ అతనికి తెలుసును అంతేకాదు! స్వయంగా అతనిముఖం కూడా చూశాడు! ఆముఖలక్షణాలన్నీ అతనికి బాగా జ్ఞాపకంఉన్నాయి! తను చెప్పినగుర్తులనుబట్టి ఆమనిషిని అరెస్టుచేయించినా ఆ వెయ్యిపౌనులు అతనిఒళ్లో పడేవే! అథమం ఆడబ్బులో కొంతభాగమైనా అతనికి దక్కిఉండేది!

ఆమనిషిని తాను మళ్ళీ చూశాననీ, అయితే చివరికి అరెస్టు చేయించలేకపోయాననీ ఆనూపర్నెంటు ఫాల్‌మాత్‌తో చెప్పడమెలాగ? అతనికిక మొహంచెల్లలేదు! ఫాల్‌మాత్ అతనలాగ చెబితే అసలు నమ్మేవాడే కాదేమో! అసలు ఆహంతకుణ్ణి అవిధంగా కలుసుకోవడమే అతనికి చాలావిచిత్రంగా కనిపించింది!

ఆఅపూర్వహంతకుడతన్ని అవిధంగా కలుసుకోడానికి కారణమేమై ఉండాలి? బహుశః ఆహంతకుడతననిగుర్తుపట్టి హత్య చేసేఉద్దేశ్యంతోనే అలాగ వెంటాడించి ఉంటాడా? ఇది ఊహించేసరికి బిల్లీ ఒళ్లు జలదరించింది! మొహంమీద ముచ్చెటలు పోశాయి!

"నిజమే! ఆ అపూర్వహంతకులు పట్టి పచ్చిరక్తంతాగే మనుషులు! అయితే?–"

"అలాగ ఆ భయంకర విషయాలలో



చిత్తాంచే అతనికెదురుగా ఒక మనిషి కనిపించాడు. అతడు రోడ్డుదాటి బిల్లీకెదురుగా వచ్చాడు బిల్లీ ఆ మనిషికేసి కొంచెం అనుమానంగా చూశాడు ఆ కొత్తమనిషి మంచి వయస్సులో ఉన్నట్టే కనబడ్డాడు. ఎంతో నీటుగా ఉన్నాడు. నీలిరంగుకళ్లు. మనిషి దగ్గిరికివచ్చినకొద్దీ మొదట పడిన అభిప్రాయం క్రమంగా మారిపోయింది. తీరా దగ్గిరగాచూస్తే అతగాడంత చిన్నవాడుగా లేడు. ఇంచుమించుగా నలభైఏళ్లైనా ఉండవచ్చుననుకున్నాడు బిల్లీ. ఆ మనిషి దగ్గిరగా వచ్చాడు. బిల్లీకేసి చురుగ్గాచూసి ఆగిపొమ్మని సంజ్ఞ చేశాడు. తొందరతొందరగా నడిచిపోయే బిల్లీ టక్కుమని అక్కడే ఆగిపోయాడు!

"నీ పేరు బిల్లీమార్కొన్నేనా"? అన్నాడా మనిషి సాధికారంగా. "అవును సార్" అన్నాడా జేబుదొంగ.

"ఫాల్‌మాత్‌ను చూశావా?"

"నిన్న రాత్రినించీ చూడ లేదు!" అన్నాడు బిల్లీ ఆశ్చర్యపడి.

"అయితే వెంటనే ఆయన దగ్గిరికి రావాలి!"

"ఎక్కడున్నాడాయన?"

"కెన్సింగ్టన్ పోలీస్ స్టేషన్లో ఒకాయన్ని అరెస్టుచేశారు. వెంటనే నీవాయన్ని గుర్తుపట్టాలి!"

బిల్లీ గుండె దిగజారిపోయింది! "ఆ మనిషిని గుర్తుపడితే నాకో బహుమతీ వస్తుందా?" అన్నాడు. ఆ రెండో మనిషి "అవు"నని తల ఊపాడు. బిల్లీకి మళ్లీ ఆశకలిగింది "వెంటనే నాతో రావాలి! ఫాల్‌మాత్‌ను మనం ఇద్దరం కలిసి ప్రయాణంచెయ్యడం ఇష్టం లేదు! కెన్సింగ్టన్ స్టేషన్‌కు ఫస్టుక్లాస్ టికెట్ కొనుక్కుని నాపక్క పెట్టెలో కూర్చో! త్వరగా రా!" అని ఆకొత్తమనిషి ఎదురుగాఉన్న రోడ్డుదాటి చేరింగ్‌క్రాస్ స్టేషన్ కేసి నడిచాడు బిల్లీ అతన్ని కొంచెం వెనకనించి వెంటాడించాడు.

కొత్తమనిషి స్టేషన్ ప్లాట్‌ఫారంమీద అటూ ఇటూ పచారుచాగించాడు. అందువల్ల బిల్లీకి అతన్ని గుర్తుపట్టడానికి వీలుపడలేదు ఇంతలో రైలు స్టేషనులో ఆగింది. బండిలోనించి దిగిన కూలీలగుంపులోనించి దారిచేసుకుంటూ బిల్లీ ఫస్టుక్లాసు కంపార్ట్‌మెంటులో ఎక్కాడు. అందులో ఎవరు లేరు. అతనొక్కడే!

ఆకొత్తమనిషి వేరె ఇంకొక ఫస్టుక్లాస్ పెట్టెలో ఎక్కాడు

బండి వెస్టుమినిష్టరు దగ్గిరికి వచ్చేదాకా బిల్లీ తన పరిస్థితిని గురించి ఆలోచించుకుంటూనే ఉన్నాడు. డిటెక్టివ్ కెలాగ తనునాపణ చెప్పాలో ముందుగానే ఒక ప్లాను వేసుకున్నాడు తరవాత ఆ బహుమతిలో తనకు రావలసిన భాగాన్ని గురించీ, దానికోసం చెప్పవలసిన మాటల్ని గురించీ ఆలోచించుకున్నాడు. అంతలో ఆ బండి ఒక చిన్న టన్నెల్లో మలుపు తిరిగింది తరవాత ఆ కొత్తమనిషి బిల్లీ కూర్చున్న గది తలుపుదగ్గర ప్రత్యక్షమయ్యాడు. తలుపు సగంవరకు తెరిచి ఉంది

మార్కొన్న అతన్ని చూసి ఆశ్చర్యపోయాడు.

"నీపక్క కిటికీ తలుపు మూసెయ్!" అన్నాడా కొత్తవ్యక్తి సాధికారంగా!

బిల్లీ కనికట్టులో ఉన్నట్టయిపోయి వెంటనే ఆ కిటికీ తలుపు మూసేశాడు ఆ సమయంలో బిల్లీకొక చిన్నసీసా బద్దలైన చప్పుడు వినిపించింది

పిమ్మట బిల్లీ రుసరుసలాడుతూ—"ఏమిటీ గొడవ?" అన్నాడు. దానికి సమాధానంగా ఆకొత్తవ్యక్తి ఆ తలుపుమూసి వేసి పక్కనే ఉన్న తనగదిలోకి వెళ్ళిపోయాడు!

మార్కొన్న మగతగా— "ఏమిటిదంతా!" అని లోలోపల గొణుక్కున్నాడు. కిందికి చూసేసరికి అతని కెదురుగా బద్దలైపోయిన సీసాముక్కలు కనిపించాయి ఆ ముక్కల పక్కగా ఒక మొహిరీ మెరిసింది. బిల్లీ ఆమొహిరీకేసి చూశాడు కాని అదంతా వట్టి వెర్రిధోరణి! అప్పుడే అతనికి స్పృహా తప్పిపోతూంది! ఇంతలో బండి స్కాన్‌స్క్వేర్ స్టేషను చేరుకుండి చివరికి బిల్లీ అక్కడపడిఉన్న ఆమొహిరీ తీసి జేబులో వేసుకోనే లేదు! —ఇంకా ఉంది.

★

# ప్రయోజకత్వం

కాశీ పట్నం సూరయ్యగారంటే చుట్టుప్రక్కల పది గ్రామాల్లో పిట్టలు కూడా నీళ్లుకూడా తాగవి కావు వంద యకరాల పొలమూ, నాలుగయిదు మామిడితోటలూ గల ఆస్తిపరుడు చుట్టుప్రక్కల గ్రామాలలో ఏ తగవొచ్చినా తీర్థమొచ్చినా సూరయ్యగారి అనుమతీ, సలహా లేనిదే కోర్టుకు వెళ్లేవి కావు తుమ్మెదరంగు కోరమీసాలూ, తెల్లటి కండువా—కుచ్చెళ్లు వేలాడుతున్న పంచె—బంగాళీతీరు లాల్చీ—అట్టే రూపసి కాకపోయినా—ఒక విధమయిన ఆకారాన్ని యిచ్చేవి నలుగురు సంతానం—ముగ్గురు మగపిల్లలూ, ఆడపిల్లా ఇద్దరు కొడుకులకీ వివాహం అయిన తర్వాత ఆడపిల్లకి దేవగుంగుభులు ప్రోగించి వివాహం జరిపించిన తర్వాత పది పదిహేను వేలు ఖరీదు చేసే భూములు కొన్నారు

ఇంటిముందు పదిబళ్లు రైలుకు వెళ్ళడానికి సిద్ధంగా వున్నాయి సూరయ్యగారు పడకకుర్చీలో కూర్చుని చుట్టకాలుస్తూ తీవ్రముగా ఆలోచిస్తున్నారు ఇంకా రైలుకు నాలుగుగంటల వ్యవధివుంది ఇల్లంతా పెళ్లి ప్రయాణం హడావుడిలో వున్నారు పెళ్ళికొడుకు, పెళ్లికొడుకు వేషంతో గదిలో ఒకమూల పెట్టెమీద కూర్చుని నాన్నగారి దృష్టి ఏదిక్కుగా వెళుతోందో కనిపెడుతున్నాడు

క్రిందటిమార్చిలో బి.యే తప్పి సెప్టెంబరుకు వెళదామా, మార్చికి వెళదామా అని ఆలోచించుకుంటున్నాడు. అభిమాన విషయం రాజకీయాలూ—ఆర్థిక శాస్త్రమూ లాస్కీని క్షుణ్ణంగా కంఠస్థంచేసిన పెళ్ళికొడుకు రాజకీయాల్లోనే తప్పిపోయాడు గదికెదురుగా లోకభయంకరుడయినతండ్రి, ఎప్పటికీ అవతలికి కదలడు చేతిలో సిగరెట్టు పట్టుకొని అరగంటయి అవకాశంకోసం చూస్తూన్నాడు. వెలిగిస్తే అగ్గిపుల్ల చప్పుడూ సిగరెటు వాసనా తన పరువూ, మర్యాదను దిక్కునియ్యవు ఇద్దరన్నయ్యలూ సందు చూసుకొని అవతలకి జారిపోయేరు. తను సాహసించాలంటే ఎదురుగా తండ్రి కూర్చున్నాడు. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ సీతమ్మ వెండిగ్లాసుతో కాఫీ—తమలపాకులు పట్టుకొస్తూ "యింకా బండికి వెళ్లవలేదా? తీరుబడిగా కూర్చున్నారు!" అని ప్రశ్నించి సూరయ్యగారి యేకాగ్రతను భంగం చేసింది "ఆ" టైము చాలా వుంది లే అయితే అన్నీ సర్దుకోడం అయినట్టేనా? అని నెమ్మదిగా నవ్వుతూ సూరయ్యగారు అడిగారు తమలపాకులకి సున్నం రాస్తూ "అయితే పిల్ల లక్షణంగా వుందా? తెల్లగా వుందా? ఏమాత్రం బంగారంవుంది? పాటలూ అవీ బాగా పాడగలదా?" సీతమ్మగారి ప్రశ్నలవర్షానికి సూరయ్య జవాబు చెప్పలేక పోతున్నారు

"అమ్మాయి ఏమిటనుకున్నావు! అచ్చగా లక్ష్మీదేవిలా వుంటుంది బంగారుఛాయ, తామరరేకులాంటి కళ్ళు త్యాగరాజ కీర్తనలు ఎంత చక్కగా పాడిందనుకున్నావు! యింతకీ సాంప్రదాయమైన కుటుంబం''

"ఎంత సాంప్రదాయకమైన కుటుంబమైనా మీరు కొద్దిగా బెట్టుచేస్తే మరో నాలుగువేలు సులభంగా చేతిలో పడేవి ఏవ్యవహారం చేసుకొచ్చినా యింతే-ముఖస్తుతి మాటలంటే వాళ్ళ వలలో పడిపోతారు'' ఇంత భీకరమైన సూరయ్యగారూ సీతమ్మ మాటలకి "అవు నవు''నని నీళ్ళు నమలక తప్పింది కాదు నాన్నగారి యీ ధైర్యప్రదర్శనాన్ని పెళ్లికొడుకు నాలుగో ఏటనుండి చూస్తున్నాడు ఇంత లోకభయంకరుడూ అమ్మదగ్గర పిల్లిలా ఎందుకయిపోతున్నాడో అర్థం కాకుండా వుంది

"బాబూ! రైలు కేలవుతోందని'' పెద్ద పాలికాపు వాకిలినుండి సవినయంగా మనవి చేసుకున్నాడు. పిల్లలంతా బళ్లు ఎక్కి కూర్చున్నారు ఎప్పుడు రైలు ఎక్కుదామా అని ఒకొక్కరే వచ్చి బళ్లు ఎక్కేసరికి అరగంట అయింది ఇంటికి తాళాలువేసి నాల్గయిదుసార్లు మళ్ళీ పరిశీలించి - యింటి భద్రతగురించి పాలికాపులకి అధికార పూర్వకమైన వుత్తర్వులిచ్చి సూరయ్యగారు బండి ఎక్కేరు. సూరయ్యగారు, సీతమ్మ, పెళ్లికొడుకూ వెండి బంగారాలున్న ట్రంకుపెట్టెతో ఆఖరు బండిలో కూర్చున్నారు అరగంటా గంటలోపల లభిస్తుందనుకున్న స్వేచ్ఛ యింక పదిగంటలవరకూ లభించదనుకున్నాడు పెళ్లికొడుకు ఆ నిరాశలో చేతితో పట్టుకున్న సిగరెట్టు చేతిని విడిచి పారిపోయింది బుద్ధిమంతుడైన విద్యార్థిలా చేతిలో పుస్తకం పట్టుకొని పేజీలు తిరగవేస్తూ కూర్చున్నాడు. ఇంకో పది పదిహేను గంటలకి తను పదివేల రూపాయలకు ఖరీదు అవబోతున్నాడు ఇదంతా తను ఆర్జించిన విజ్ఞానఫలితమేనా? కాదు ఎంతసేపు యిలా ఈ యినుప వూచలు లేని బందిఖానాలో కూర్చోడం స్వేచ్ఛను ప్రకటించుకోడానికి శక్తి చాలకపోయింది.

"ఏమిరా బాబూ! తాంబూలం వేసుకుంటావా?" అని ఎర్రబారిన తన పెదవులను ముందుకు తోసుకుంటూ సీతమ్మ పెళ్లికొడుకుని అడిగింది ధైర్యంగా కావాలని చేయి జాచలేకపోయేడు "మా చిన్నవాడికి ఏ అలవాట్లూ లేవు!" అని సగర్వంగా అమ్మ యిరుగుపొరుగు వాళ్లతో చెప్పుకోడం పెళ్లికొడుకు ఎన్నోసార్లు విన్నాడు. కాని చాటుచాటుగా సిగరెట్ల పొగతో తన గుండె లెండిపోతున్నాయని అమ్మకేం తెలుసు చేతిలోంచి జారిపోయిన సిగరెట్టు సంగతి జ్ఞప్తికి వచ్చింది బండి అంతా పరిశీలనగా చూసేడు సీతమ్మ మరల మొదలెట్టింది

"అయితే వియ్యపురాలి కట్నం విషయములో అంత మెత్తబడి పోయేరేమిటి! ఒక వెయ్యి రూపాయలూ, నాలుగు కాసులూనా? ఇంకో నాలుగురోజులు మాట ఇవ్వకుండా వుంటే రెండువేల వరకూ దిగి వచ్చురే!" అని సూటిగా సూరయ్యని చూస్తూ అడిగింది.

"ఎక్కడికేమిటి యీ ఆశ! ఏదో పని పెట్టుకు పోవాలి అయినా వాళ్లు చాలా

## ★ ప్రయోజకత్వం ★

స్థితిమంతులు. ఈరోజు కాకపోయినా రేపయినా ఆ మాత్రం వియ్యపురాలికి ముట్టచెప్పకపోరు" సూరయ్య సమాధానం సీతమ్మకేం నచ్చలేదు.

"పెళ్ళిలో ముచ్చట పెళ్ళిలోదే. పెద్దవాడి పెళ్ళికి రెండువేలూ వాళ్ళు గుమ్మరించలేదూ ఏ వ్యవహారం చేసుకొచ్చినా ఇలాగా చేసుకొస్తారు!"

"అయితే ఏం చేయమంటావ్. ఇంకా బెట్టుసరి చేస్తే సంబంధమే తప్పిపోయేటట్టు కనిపించింది ఎప్పుడూ లేనిది పీడు ఈయేడాదే పరీక్ష తప్పిపోవాలి! మన అదృష్టం అలా వుంది ఎవరినంటే ఏం లాభం!" తండ్రి తీక్షణమైన దృష్టి తనని భస్మం చేయకుండా ఒక మూలకు తిరిగి కూర్చున్నాడు పెళ్ళికొడుకు.

మగపెళ్ళివారమని అనుకోగానే ముఖాల్లోనూ నడకలోనూ మార్పు దానంతటఅదే వస్తుంది పెళ్ళికొడుకు మేనమామ కూతురు కొడుకు యువరాజు శివిలో నడుస్తాడు. ఆడపెళ్ళివారంటే అంతా ఆడవాళ్ళేకదూ! పెళ్ళివారు వస్తుంటే ఆడపెళ్ళివారు ఎదురుగా వచ్చి హారతులు పట్టాలనీ, నడుములు కట్టుకుని నిల్చోవాలనీ, ఏదడిగినా, లేదనకుండా ఆలస్యం చేయకుండా తీసుకొచ్చి సగౌరవంగా సమర్పించాలనీ-యీ లక్షణాలన్నీ ఆడపెళ్ళివారికి విధిగా వుండాలనీ సీతమ్మ నమ్మకం. రైలు దిగేసరికి ప్లాట్ ఫారంమీద సీతమ్మ కోరుకున్నట్టే ఆడపెళ్ళివారు చేతులు కట్టుకొని నిలబడి చిన్నా పెద్దలకు స్వాగతవచనాలు చెప్పేరు. మైసూరు ఎడ్లుకట్టిన బళ్లు అవతల సిద్ధంగా వున్నాయి పట్టుకొచ్చిన కాఫీ ఫలహారాలతో పెళ్ళివారి మార్గాయాసాన్ని తీర్చి బళ్లమీద బయలుదేరేరు-ఒకగంటలో బళ్లన్నీ గమ్యస్థానానికి చేరుకున్నాయి. మగపెళ్ళివారి ఆడవాళ్లు వియ్యపురాలి నాయకత్వాన భోజనాలక్కి వెళుతూ పెళ్ళికూతుర్ని చూపించమన్నారు. సిగ్గు ఒలకపోసుకుంటూ శిరస్సు నేలను చుంబిస్తున్నదా అన్నట్టుగా తలవంచుకొని నిలబడ్డది పెళ్ళికూతురు. అత్తగారి ధోరణితో సీతమ్మ ఒకపాట పాడమంది పెళ్ళికూతుర్ని. ఎంతసేపు శాసించినా ఏ త్యాగరాజు కీర్తనలుగాని, మంగళహారతులుగాని ప్రసారం అవలేదు. సీతమ్మ ముఖం ఎర్రబడ్డది. అత్తగారాయె! ఆమెకు కోపం రావడం చాలా సహజమే కాని పెళ్ళికూతురు మాత్రం శాసనోల్లంఘనం చేస్తూ యోగనిద్రలో పడిపోయినట్టు నిలుచుండిపోయింది. చుట్టూ నిలబడ్డ మగపెళ్ళివారి ఆడజనం పెళ్ళికూతురు ధిక్కారభావానికి ముక్కుమీద వేలు వేసుకున్నారు.

"మాపిల్లకి చాలా సిగ్గు వదినా! నాల్గురోజులయితే మిమ్మల్నందరినీ పాటలలో ముంచేస్తుంది తొందర పడకండి!" అంటూ సమాధానం చెప్పుకుంది పెళ్ళికూతుగు తల్లి. పిల్లకి సిగ్గువుండవలసిన విషయంలో సీతమ్మకేమీ అభిప్రాయభేదం లేదు. పెళ్ళికూతురన్న పిల్లకి సిగ్గూ బిడియమూ వుండవలసిందే. కాని అత్తగారి అధికారయుతమైన ఆజ్ఞను ఆపిల్ల ఒక్కసారి శిరసావహించచవలసింది. పెళ్ళికూతురు యింకా మూడుముళ్లూ పడకముందే తన అధికారాన్ని శంకిస్తున్నదనే కోపం సీతమ్మకి ఒక్కసారిగా వచ్చిపడింది దినికి అమ్మలక్కల గుసగుసలు తోడయినాయి. ఎలాగో భోజనాలు చేసేమని పించివిడిదిలో ప్రవేశించేరు.

తాంబూలంకూడా వేసుకోలేదు వస్తూనే సూరయ్యవున్న గదిలో ప్రవేశించింది. అక్కడ కూర్చున్న ఆడవాళ్లు, మగవాళ్లూ సిగ్గుపడిపోయి అవలకు జారిపోయేరు ఉపోద్ఘాతాలు పరిచయవాక్యాలూ లేకుండానే సీతమ్మ మొదలు పెట్టింది.

"మీకు కళ్ళజోడు పెట్టుకున్నా చత్వారం తగ్గలేదా?-ఇదే నా పిల్లను చూసుకొని స్థరపరచుకున్న సంబంధం. ఏం అందం వుందని పదివేలకే వప్పుకున్నారు? ఆ ఎత్తుబుగ్గలూ ఆ లోతుకళ్లూ ఇదేనా అందం! మనవాడికి తగిందనేనా వప్పుకున్నారు!"

ఈ ఆకస్మికమైన దాడికి సూరయ్య సిద్ధంగా లేకపోవడంమూలాన కంగారుగా కుర్చీలోంచి లేవబోతూ "ఏమిటలా అంటున్నావ్! ఇప్పుడేం వచ్చింది బాగానే వుందే?" అని నీళ్లు నములుతూ జవాబు చెప్పేడు.

ఈ నాసిరకం సంజాయిషీతో సంతృప్తిపడే రకంగాదు సీతమ్మ.

"నాకేం, దాని అందం, చందం నచ్చలేదు. సంసారపక్షంకంటె నాసిగా వుంది. ఈమాత్రం దానికి పదివేలకి ఒప్పుకోడానికి వీలులేదు. వెంటనే బయలుదేరిపోదాం పదండి" ఆమె వాక్కులో నిశ్చలత్వాన్నీ గాంభీర్యాన్నీ సూరయ్యగారు చూశారు.

"తప్పు! అలాటి వుద్దేశం కూడదు. నలుగురిలోనూ ఎంత అగౌరవం - ఎవరైనా వింటే ఏమంటారు?" ముక్కుమీద వేలు వేసుకుంటూ నిలబడ్డాడు సూరయ్య.

"మీరు ముక్కుమీద వేలు వేసుకుంటే ఏమీ వూడిపడదు చెపుతున్నా-యీ సంబంధం అవడానికి వీల్లేదు. తెల్లవారుజాము బండికి తిరుగు ప్రయాణం కావలసిందే-లేచి ఆ ప్రయత్నమే చేయండి ప్రయోజకత్వం అంటే మీకు!" ఈ మాటలంటూనే సీతమ్మ తన గదిలోకి పోయింది సూరయ్యకేమీ తోచలేదు. భార్య చెప్పినదానిలో నిజం ఎందుకుండకూడదు? తనూ-కొడుకూ పొరపాటుగా చూసివుంటే వుండవచ్చు ఏమో ఇంకో పిల్లనే చూపించి వుండకూడదూ వాళ్లు! ఇంతకూ ఆడపెళ్ళివాళ్లు ఎంతటి అఘాయిత్యాలయినా చేస్తూ వుంటారు లోకంలో. కాలం అలాటిది. కాని ఒక్క భార్యమాటమీద ఈ స్థితిలో పెళ్లి ఆపు చేయించడం ఎలా సాధ్యపడుతుందో పదిహేను కూనీ కేసుల్ని జయప్రదంగా నడిపిన సూరయ్యకి అంతుదొరకలేదు ఏవిధంగా ఈ విషయాన్ని రంగంలోకి విసరడమో సూరయ్యకి పాలుపోకుండా వుంది చుట్టమీద చుట్ట కాలుస్తున్నా. పొగమాత్రం గది అంతా నిండిపోయింది కాని బుర్రలోంచి ఒక్క ఆలోచనా పైకి రాలేదు

"బావగారూ! నాదొక్క మనవి!" అని వియ్యంకుని సంబోధన చెవినిపడేవరకూ సూరయ్యకి మెలుకువ రానేలేదు.

"మరేమీ లేదు-మా పెద్దవియ్యపురాలు ఒక మాట అంది. మా పెద్దమ్మాయి వివాహ సందర్భంలో ఆమెగారికి రెండు వేలు కట్నం-పట్టుచీర, నాలుగు కాసులు అత్తగారి లాంఛనంగా ఇచ్చి గౌరవించేము ఆ గౌరవాలే యీ వివాహసందర్భంలో కూడా జరిపించడం తప్పదని ఆమె పట్టుపట్టింది. ఆవిడమాటను నేను కాదనలేకపోయేను. ఎలాగయినా ఆడవాళ్ళంతా ఒకటే-అందులో ఏ ఒకరికి గౌరవం తక్కువగా జరిగినా వప్పుకోరు అదీ కాకుండా ఆమె చెప్పిన విషయంలో చాలా న్యాయంకూడా వుంది. నేనుకూడా ఆవిధంగానే జరిపించడానికి వప్పుకున్నాను ఇది తమతో మనవి చేసిపోదామనే వచ్చేను-చాలా రాత్రయింది మళ్ళీ నాలుగు గంటలకే లేవాలి. కాస్త విశ్ర

# రంగడు

పోతుకూచి సాంబశివరావు

మిట్ట మధ్యాహ్నపు ఎండ లెక్క చెయ్యకుండా ఉషారుగా వీధిలోకి పరుగెత్తాడు రంగడు. వీధి చివరి రావిచెట్టు క్రిందనుంచుని, ఎదురుగా ఉన్న మేడవైపు గట్టిగా ఈలవేశాడు ఈల విని మరో నిమిషంలో చప్పుడు లేకుండా అడుగులు వేసుకుంటూ జమీందారు గారి అబ్బాయి శివుడు, అమ్మాయి లీల, రావిచెట్టు క్రిందకు వచ్చారు.

'మీ నాన్నగారు యింట్లో వున్నారా?' అన్నాడు రంగడు.

'నాన్నగారు నిద్రపోతున్నారు అమ్మ యింట్లో ఏదో పని చూసుకుంటోంది' అన్నాడు శివుడు

మంచి తెలివి తేటలతో దొంగతనంగా యింట్లోంచి దాటి వచ్చామన్నట్టు గర్వంగా నవ్వింది లీల

'చిన్ననాయుడు యింకా రాలేదా?' రంగడు శివుడివైపు చూశాడు

'వచ్చాను' అంటూ పకపక నవ్వుతూ చిన్ననాయుడు రావిచెట్టుమీద నుంచి ఆ కుర్రాళ్ళ మధ్యకు దూకాడు. చిన్ననాయుడు అందరికన్నా ముందు వచ్చి స్నేహితులకు తన రాకవల్ల ఆశ్చర్యం కలిగించాలని చెట్టు ఎక్కి దాక్కున్నాడు.

'వెడదామా' అన్నాడు రంగడు.

'ఊఁ' అన్నాడు శివుడు.

చుట్టుప్రక్కల రోడ్డుమీద ఎవరూ నడవటంలేదు కదాఅని ఒక్కసారి పరీక్షించాడు చిన్ననాయుడు.

తల్లితండ్రులు యింట్లో ఎండవేడికి కునుకు తీసుకుంటున్నప్పుడు, ఎవరికీ తెలియకుండానే ఒకపని చెయ్యాలనుకున్నారు ఆ కుర్రాళ్ళందరు.

మెల్లిగా నాగులచెరువు గట్టువైపు నడిచారు ఆ నల్గురూ. చెరువులో నీళ్లు ఎండలో తళతళ మెరుస్తున్నాయి చెరువులో పెరిగిన నాచు, చెత్తా, చేదారం మొదలైన వాటిని శుభ్రం చెయ్యడానికి ఒక పడవ చెరువుఒడ్డున కట్టిఉంది. గట్టుమీద తీసి వేయబడిన నాచు గుట్టలు గుట్టలుగా పడి ఎండిపోయింది ప్రతిఏడు పెరిగిన నాచు, వేసవికాలంలో చెరువులోంచి తీసి వేయడం ఆ గ్రామంలో అలవాటు.

ఆ పడవ చూశాక ఒకరోజు రంగడికి ఒక ఆలోచన తట్టింది ఆ పడవఎక్కి నడుపుకుంటూ చెరువులో షికార్లు చెయ్యాలని బుద్ధిపుట్టింది రంగడికి దీనికి జమీందారు గారి అబ్బాయికూడా ఒప్పుకున్నాడు. పడవ ఎక్కాలని లీల గంతులు వేసింది. చిన్ననాయుడు 'రెడీ' అంటూ చొక్కా చెవులు రిక్కించాడు మిట్టమధ్యాహ్నం అందరూ భోంచేసిసాధారణంగా విశ్రమించే సమయంలో ఆపని చెయ్యాలని నిశ్చయించుకున్నారు ఆ కుర్రాళ్ళందరు

చెరువులో ఉన్న పడవను చెరువుగట్టుమీది ఒక ఈతచెటుకు ఒక తాడుతో కట్టారు ఆ తాడు విప్పేశాడు చిన్ననాయుడు.

రంగడు పడవలోకి దూకాడు. జమీందారుగారి అబ్బాయి, లీలను మెల్లిగా పడవ ఎక్కించాడు. చిన్ననాయుడు పంట్లాం పైకి మడచి పడవతోసి లోపలికి ఎగిరాడు.

పడవ చెరువునీళ్ళల్లోకి నడిచింది రంగడు తెడ్డు వేశాడు చెరువునీళ్ళు పడవనడకలో చీలి, ఎగిరి, కెరటాల్లా కదులుతూ గలగలా శబ్దంచేస్తున్నాయి. ఒకవైపు బీట వేసిన చేలగట్లు, మరోవైపు అమ్మవారిగుడి స్పష్టంగా చెరువులోంచి కనిపించాయి ఆ కుర్రాళ్ళకు. పడవ మెల్లిగా చెరువు మధ్యకు వచ్చింది; నాచును చూసుకుంటూ, చేతికందిన కలువపువ్వులు, కాడలు, కోస్తున్నాడు నాయుడు. కలువ కాడలు విరిచి, నీళ్ళల్లో ఊది, గాలిబుడగలు తెప్పిస్తోంది లీల. జమీందారుగారి అబ్బాయి సినీమా పాటలు మ్యాని రాగాలుగా ఆలపిస్తున్నాడు. రంగడు ఒక గొప్ప నాయకుడిలా పోజు పెట్టి ఠీవిగా నవ్వాడు

రెండు గంటలు గడిచాయి. ఆ అరమైలు చదరంగం చెరువులో అప్పుడే చాలా ప్రదక్షిణాలు చేశారు ఆపడవ త్రిప్పుతూ కుర్రాళ్ళంతా.

మిట్ట మధ్యాహ్నపు ఎండ తగ్గడంవల్ల చెరువు ప్రక్కన ఉన్నరోడ్డు మీద కొంతమంది జనం నడుస్తున్నారు ఎవరూ చెరువులోని పడవను చూడలేదు ప్రత్యేకించి చూసినా, కూలివాళ్లు చెరువులో నాచు తీస్తున్నారనుకున్నారు అంతా.

చెరువు మధ్యకు వెళ్ళినపడవ హఠాత్తుగా ఆగిపోయింది. తెడ్డుతో ఎంత నెట్టినా కదలడం మానేసింది దట్టంగా అల్లుకున్న నాచులోకి ఆపడవజారి, బయటికి రావడం కష్టమైపోయింది.

కూలివాళ్లు నాల్గు గంటలకు చెరువుదగ్గరకు వచ్చారు. పడవను చెరువు మధ్య చూసి ఆశ్చర్యపోయారు. దూరంనుంచి, పడవలో కుర్రాళ్లు ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తోంది.

నాచుమధ్యనుంచి ఈదుకుని చెరువు మధ్యకు వెళ్లడం ఎవరికైనా కష్టమే. ప్రతీఏడు యీ నాచుతీసే రోజుల్లో ఎవరో ఒకరు చెరువులో చనిపోవడం మామూలు. ఆ భయంవల్ల కూలివాళ్లు, చెరువులో ఈది, ఆ పడవను ఒడ్డు చేర్చడానికి జంకారు.

చెరువు మధ్య చిక్కుపడిన పడవ చూస్తూ గట్టుమీద మూగిన జనం వింతగా చూస్తున్నారు.

పడవలో రంగడికి అమిత భయం కలిగింది. లీల ఏడ్వడం మొదలు పెట్టింది. జమీందారు



---

మించండి" అంటూ కాబోయే వియ్యంకుడు నిష్క్రమించేడు

ఇదంతా యింద్రజాలంలా కనిపించింది సూరయ్యకి. ఏ ప్రశ్నకయితే తను సమాధానం వెదుకుతున్నాడో ఆ సమాధానం యేతెరువూ—ధర్మం అడక్కుండా తనముందు సాగిలపడుతుందని సూరయ్య కలలోకూడా వూహించుకోలేదు. ఒక్క నిమిషంలో ఈ వార్త, మగపెళ్ళివారి ఆడజనాభాలో ప్రసారం అయిపోయింది.

రెండు వేలూ, పట్టుచీరా, నాలుగు కాసులూ, తాంబూలం వున్న వెండి కంచంమీద చెయ్యివేస్తూ, మందహాసంతో సీతమ్మ వధూవరుల నిద్దరినీ "వెయ్యేళ్లు వర్ధిల్లాలి" అని మనస్ఫూర్తిగా దీవించింది.

కథ కంచికి వెళ్ళింది కాని-అమ్మప్రయోజకత్వం వల్ల శాస్త్రికి నోరులేని—అచ్చంగా రంభనుపోలిన భార్యా, కొద్దికాలంలో ఒకరివెంట ఒకరు అయిదుగురు నోరున్న ఆడపిల్లలూ లభించారు. 



# రంగడు



గారి అబ్బాయి, చిన్నా నాయుడు తలలు గోక్కుంటూ, భయంతో ఒకరి వైపు ఒకరు చూసుకుంటూ, ఏం చెయ్యడానికీ తోచక దిక్కుముఖంతో కూర్చున్నారు పడవలో.

చెరువుగట్టుమీద జనాన్ని చూసుకుని గవరయ్య చెరువులోకి దూకాడు. నాచును విడతీసుకుంటూ అతికష్టంమీద చెరువు మధ్య పడవను చేరాడు. ఒక చేత్తో పడవ పట్టుకుని మరొక చేత్తో ఈదుతూ పడవను గట్టు చేర్చాడు.

పడవ గట్టు చేరగానే చిన్నానాయుడు గబుక్కున దుమికి పారిపోయేడు జమీందారుగారి పిల్లలనే గౌరవంతో, శివుడిని, లీలను, గవరయ్య ఏమీ అనలేక పోయాడు రంగడు పడవ దిగి పారిపోదామనుకుంటూంటే గవరయ్య అతణ్ణి పట్టుకున్నాడు

'ఏరా బుద్ధిలేదూ? చెరువు మధ్యకు పోయారు! ఛస్తేనో!"

పిల్లల గండం తప్పించకలిగేనన్న ధైర్యపు చనువుతో రంగడిని చెంపమీద చరిచాడు గవరయ్య

ఆ చెంపమీది దెబ్బ రంగడికి తల తిరిగినంతపని చేసింది 'కంసాలి గురవయ్య కరణంగారి అబ్బాయిని కొడతావూ? పైగా నల్గురిలో అందులో తన్నొక్కడినే గవరయ్య కొట్టాడని రంగడికి బాగా ఉక్రోషం వచ్చింది

'నువ్వెవరవు నన్ను కొట్టడానికి' కోపంతో అరుస్తూ చెరువు గట్టుమీద ఒక కంకర్రాయి తీసుకుని గవరయ్యమీదకు రివ్వున విసిరాడు రంగడు.

గవరయ్యకు గాయం తగిలి రక్తం కారింది దానితో కోపం మరీ హెచ్చి గవరయ్య రంగడిని మరో రెండు దరుపులు చరిచాడు ఆ దెబ్బల భారంవల్ల రంగడికి రెండురోజులు జ్వరం వచ్చింది తాను పెద్దవాడయ్యాక ఎప్పటికైనా గవరయ్యమీద కసితీర్చుకోవాలని క్రుద్ధుడైపోయాడు రంగడు. కొడుకుకు జ్వరం వచ్చిందని గవరయ్యమీదకు జట్టీకి దిగారు కరణంగారుకూడా

గవరయ్యకు గజఈతగాడని పేరు ఆ గ్రామంలో సాయంత్రం స్నానానికి చెరువుకు వచ్చి, నీళ్ళలో రకరకాల పిల్లిమొగ్గలు వేస్తూ, ఆడుకుందుకు చెరువు గట్టుకు వచ్చే పిల్లలను ఆనందింపచేసేవాడు గవరయ్య ఒక్కొక్కసారి నీళ్ళలో మునిగి ఒక అరమైలు అవతల తేలడం, అర్ధగంటయినా పైకి రాకపోవడం, పిల్లలకు చాలా సరదాగా ఉండేది చూడడానికి బులెప్పగారి పదేండ్లకూతురు, వంకయ్యగారి పాతికేండ్లకొడుకు చెరువులో జారి మునిగి, కుటకలు వేస్తోంటే గవరయ్యే రక్షించాడు అందుకు గవరయ్య అంటే అందరికీ గౌరవమే

ఒకరోజు సాయంత్రం రంగడు ఒంటరిగా చెరువుగట్టుమీద కూర్చుని చెరువులో కాగితంపడవలు వదులుతున్నాడు ఒక పడవ తామరకాడదగ్గర ఆగిపోయింది మరొకటి గాలిలో కదులుతూ ఒయ్యారంగా నడుస్తోంది మరొకటి చెరువు ప్రక్కని రాతికి అడ్డుకుంది.

వెనకాలనుంచి గవరయ్య రంగడి పడవలు చూశాడు ఒక పడవమీద సరదాగా ఒక రాయి విసిరేడు కాగితంపడవ నీళ్ళల్లో తడిసి మునిగింది

గవరయ్యను చూడగానే రంగడికి కోపం వచ్చింది.

'ఏయ్, నాజోలికి రాకు అనవసరంగా' అరిచాడు రంగడు గవరయ్య నవ్వాడు. ఆ నవ్వుచూసి రంగడికి మరీ కోపంవచ్చింది.

'ఫో' అరిచాడు రంగడు.

గవరయ్య దగ్గరిగా వచ్చాడు అప్పుడే బజారునుంచి కొని తెచ్చిన సంచిలోని మామిడిపండు తీసి రంగడిచేతిలో పెట్టాడు.

'అక్కరలేదు పో' అన్నాడు రంగడు

'నా బాబుకదూ! తిను!' అన్నాడు గవరయ్య రంగడిగడ్డం పట్టుకుని

మామిడిపండు తినాలని బుద్ధిపుట్టి, గవరయ్య మంచితనం అర్థంచేసుకున్నాడు రంగడు రంగడు మామిడిపండు తింటున్నాడు గవరయ్య హాయిగా నవ్వాడు

చెరువులోని ఒక కాగితంపడవ గాలికి తీవిగా పరుగెత్తి, చెరువుమధ్య నాచులోకి పోయింది

'అరె! పడవ చాలాదూరం పోయిందే!' నొచ్చుకున్నాడు రంగడు

'తెచ్చి యివ్వనా' అన్నాడు గవరయ్య

'పిల్లిమొగ్గలు వేస్తూ తేవాలి' అన్నాడు రంగడు

'ఓ' అంటూ గవరయ్య చెరువులోకి దూకాడు

ఒక్కమునుకు మునిగాడు గవరయ్య

కాగితంపడవ దూరాన కనిపిస్తూనే వుంది కాని, గంట గడిచినా గవరయ్య తేలలేదు చెరువులో యెక్కడా

గవరయ్య ఏదో తమాషా చేశాడనుకుంటూ రంగడు యింటికి వెళ్ళిపోయాడు

మర్నాడు ప్రొద్దున్న గవరయ్య శవం చెరువులో తేలింది ఆ చెరువులో పాములు ఉన్నాయని, ఊబి ఉందని, జనం మామూలుగానే అనుకుని, గవరయ్య ఊరుకు చేసిన సహాయమంతా ఒక్కమాటలో మరిచిపోయారు అంతా జీవితంలో 'నా' అనే వాళ్లు లేని గవరయ్యకై కన్నీరు కార్చేవారే కనిపించలేదు కాని రంగడు మాత్రం గవరయ్య చనిపోయేడని కుమిలి కుమిలి యేడ్చాడు.





నేషనల్ ఆర్ట్ థియేటర్సు "జయసింహ" చిత్రానికి రాజమండ్రి రామాటాకీస్‌లో జనవరి 30 వ తేదీన శతదినోత్సవాలు జరిగాయి.

సాహూఫిలిమ్స్ వారి "కిస్మత్ కా ఖేల్"లో సునీల్ దత్, బీగంపారా




నేషనల్ ఆర్ట్ థియేటర్సు "జయసింహ" చిత్రానికి రాజమండ్రి రామాటాకీస్‌లో
జనవరి 30 వ తేదీన శతదినోత్సవాలు జరిగాయి.

సాహూఫిలిమ్స్ వారి "కిస్మత్ కా ఖేల్"లో సునీల్ దత్, బీగంపారా

గిస్తే చిత్రానికి కుదింపు వచ్చేది. మిగతా అన్ని అంశాల్లోనూ బిమల్ రాయ్ చిత్రం హిందీ చిత్రాల సగటు స్థాయికి చాలా పైన ఉన్న చిత్రం అనిపిస్తుంది.

## శ్రీ ద్వారం, శ్రీమతి భానుమతి గారలకు సన్మానం

కావలి కళాశాల అధ్వర్యాన జనవరి 16 నుంచి 22 వరకూ జరిగిన కళోత్సవాల సందర్భంలో ఆఖరి రోజు ఉదయం, సంగీత రత్నాకర శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు, సుప్రసిద్ధ నటి శ్రీమతి పాలువాయి భానుమతి గారలకు సన్మానం జరిగింది. సభకు శ్రీ దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి అధ్యక్షత వహించారు. సంగీత విద్వాంసులు ఆచార్య పి. సాంబమూర్తి, శ్రీయుతులు పాలగుమ్మి పద్మరాజు, వేదుల సత్యనారాయణ శాస్త్రి, శ్రీరంగం నారాయణ బాబు ప్రభృతులు సన్మానితులను ప్రశంసిస్తూ ప్రసంగించారు. శ్రీ సత్యనారాయణశాస్త్రి ద్వారం నాయుడు గారికీ, శ్రీ రాం వెంకట భుజంగరాయశర్మ శ్రీమతి భానుమతికీ సన్మానపత్రాలు సమర్పించారు.

తరువాత, ఉత్సవ సందర్భంలో జరిగిన నృత్య నాటక ప్రదర్శన పోటీల్లో పాల్గొన్న విద్యార్థులకు శ్రీమతి భానుమతి బహుమతులు పంచి పెట్టారు. నటనలో రామకృష్ణమాచారి, వై. చంద్రమౌళి, వి. వీరాస్వామి, డి. సోమయాజులు నాట్యంలో కుమారి ఇందిర, సంగీతంలో కుమారి జయశ్రీ, చిత్రకళలో సి. సుబ్బారెడ్డి, బి. రాజదాసం, పి. సత్యనారాయణ, డి. రామబ్రహ్మం, వేదుల రాజ్యలక్ష్మి బహుమతులు పొందారు.

ఈ ఉత్సవ సందర్భంలో శ్రీ గోపీనాథ్ అభినయం, శ్రీ ద్వారం భావనారాయణరావు సంగీత కచేరీ కూడా జరిగాయి. 22 వ తేదీన శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు రెండు గంటలసేపు వయొలిన్ కచేరీ చేశారు. ★



కొలంబియా పిక్చర్స్ తార క్లియోమూర్

## ఐజెన్‌స్టీన్ తొమ్మిదవ వర్ధంతి

ప్రపంచ చలన చిత్ర చరిత్రలో అతి ప్రముఖస్థానం ఆక్రమించిన సోవియట్ దర్శకుడు శ్రీ॥ శే॥ ఐజెన్‌స్టీన్ తొమ్మిదవ వర్ధంతి ఈ నెల 10-వ తేదీ. ఐజెన్‌స్టీన్ తన జీవితకాలంలో అయిదే చిత్రాలు నిర్మించాడు. వీటిలో మూడు సైలెంట్ చిత్రాలు, రెండు టాకీచిత్రాలు. ఈ ఐదు చిత్రాలు చలనచిత్ర కళకు అయిదు అమూల్యాభరణాలని ప్రముఖ విమర్శకులందరూ అభిప్రాయపడ్డారు. చలనచిత్రం ఒక ప్రత్యేకకళ అనీ, మరే లలితకళకూ లేని విశిష్టత దానికున్నదనీ, ఆవిశిష్టతను గ్రహిస్తేతప్ప చలనచిత్రం ఒక కళగా రూపొందదనీ మొదటిసారిగా ప్రపంచానికి చాటి చెప్పిన వ్యక్తి ఐజెన్‌స్టీన్. క్లోజప్‌ల ఉపయోగం దగ్గర్నుంచి, చలనచిత్రంలో వాస్తవికతకు గల ప్రధాన స్థానంవరకూ అనేక విషయాలను ఈయన స్వయంగా పరిశోధించి తనచిత్రాల ద్వారా

# బొంబాయి సినిమా లేఖ

చలనచిత్రాల వివిధశాఖలలో ఉత్తములని నిర్ణయింపబడిన వారికి 'ఫిల్మ్ ఫేర్' పత్రికవారు ఏటా యిచ్చే బహుమతులను వచ్చే మార్చి నెలలో ఇవ్వనున్నారు. క్రిందటి యేడు పది శాఖలలో ఉత్తములకు బహుమతు లిచ్చారు. ఈయేడు ఫిలిం ఎడిటింగ్, సెట్స్ నిర్మాణం శాఖలకు కూడా బహుమతులిస్తారు. ఓటింగ్ లో 30000 మంది పాఠకులు పాల్గొన్నారట. అయితే పాఠకుల ఓట్లనుబట్టి ఏ ఒక్కరికీ మెజారిటీ రానందువలన, ఆఖరి నిర్ణయాలు చేయడానికి జస్టిస్ ఎస్. ఆర్. టెండల్కార్, ఎస్. ఎస్. వాసన్, ఎస్. కె. పాటిల్, సి. ఎం. అగర్వాలా, జె. సి. జైన్ గార్లతో ఒక సంఘాన్ని యేర్పాటుచేశారు.

*   *   *

బొంబాయినగరం రాజధానిగా సంయుక్త మహారాష్ట్రం కావాలని ఆందోళనచేసే కొందరు ఇటీవల నగరంలో విశృంఖలంగా జరిపిన అత్యాచారాలు సినిమావారి మీద్ధికి కూడా తిరిగాయి. సినిమా మందిరాలు దాదాపు అన్నీ రోజుకు ఒక ఆట మాత్రమే ప్రదర్శించడానికి వీలైంది. ఆ ఒక్క ఆటకు కూడా జనం పల్చగా వున్నారు. మహారాష్ట్రులు ఎక్కువగా ఉన్న ప్రాంతంలో ఒక హాలులో హిందీ పౌరాణిక చిత్రం "ఏకాదశి"ని మార్చివేసి దానిబదులు పాత మరాఠీచిత్రం "లఖాచీ గోష్టా" ప్రదర్శింపవలసి వచ్చింది. తారవ కీలా, కర్దార్ స్టూడియోస్ కు వెడుతుండగా పరేల్ వద్ద జనం ఆమెను అడ్డగించి ఆమె కారు చెడగొట్టి, ఆమె కాలుపై గాయంచేసి వదిలిపెట్టారు. నసీర్ ఖాన్ కు కూడా దెబ్బలు తగిలాయి. అతని అన్న దిలీప్ కుమార్ కు చెందిన కారుకూడా పాడుచేశారు. తార నిమ్మీ జనానికి భయపడి భరత్ భూషణ్ ఇంట్లో తలదాచుకోవలసి వచ్చింది. శివాజీ పార్క్ ప్రాంతంలో నివసిస్తున్న గుజరాతీ తార నిరూపరాయ్ అతికష్టంమీద, పోలీసుల సకాల సహాయంవలన తనను, తన గృహాన్ని కాపాడుకోగలిగింది.

మొత్తంమీద బొంబాయిలో భిన్న భాషలవారి మధ్య తీవ్రమైన ద్వేషాలు పెరిగాయి. సినిమా వ్యాపారానికి వెన్నెముకవంటి గుజరాతి డిస్ట్రిబ్యూటర్లు, పెట్టుబడిదారులు డబ్బుపెట్టడం తగ్గించేశారు. వ్యాపారం బాగా దెబ్బతిన్నది.

*   *   *

నవభారతంలో పారిశ్రామికాభివృద్ధిని చిత్రిస్తూ బర్మాషెల్ వారు వరసగా కొన్ని డాక్యుమెంటరీలు తీయాలని సంకల్పించారు. ఇవి ఎడ్వర్టయిజింగ్ చిత్రాలు కావు. కేవలం విద్యాబోధక చిత్రాలు. బర్మాషెల్ వారికి ఇంతవరకు స్వంత నిర్మాణసంస్థ లేదు. అందుచేత నిర్మాణంపని ఇతరులచేత చేయిస్తున్నారు. "భారత గ్రామీణ పరిశ్రమలు" అనే పేరుతో వీరు వరుసగా కొన్ని చిత్రాలు తీస్తున్నారు. వీటిలో మొదటిది షోలాపూర్ జిల్లా, మైన్ దర్గీ గ్రామంలోని చేనేత పారిశ్రామికులకు సంబంధించిన ఇతివృత్తంతో నిర్మించబడింది. రామా, బాబా అను ఇద్దరు చేనేతపనివారిని పాత్రలుగా తీసుకుని వారి సమస్యలను చిత్రించారు. ఇది 28 నిమిషాల చిత్రం. "భారతదేశపు భారీపరిశ్రమలు" అనే పేరుతో తీయదలచిన చిత్రాలలో మొదటిదిగా "వ్యవసాయం" అనేచిత్రం నిర్మించబడింది. ఇది 42 నిమిషాలసేపు నడుస్తుంది. చిన్న కథ సహాయంతో వ్యావసాయిక సమస్యలను చిత్రిస్తుంది. ఈచిత్రాలను ముఖ్యంగా విద్యాసంస్థలలో ప్రదర్శించాలని బర్మాషెల్ వారి సంకల్పం.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయివిలేఖరి)

★

## శ్రీ ఎన్. టి. రామారావుకు సన్మానం

ప్రసిద్ధనటుడు శ్రీ ఎన్. టి. రామారావుకు నర్సాపురం తాలూకా పెనుగొండలో జనవరి 28న సన్మానం జరిగింది. సభకు పాలకొల్లు స్టేషనరీ సబ్ మేజస్ట్రేటు అధ్యక్షత వహించారు. పలువురు శ్రీ రామారావు నటనా సామర్థ్యాన్ని ప్రశంసిస్తూ మాట్లాడారు. తరువాత శ్రీ సూరి లక్ష్మీనారాయణ శ్రీ జవ్వాది రంగారావు, శ్రీ రామారావుకు చెరొక రజతపాత్ర బహూకరించారు. శ్రీ రామారావు మినర్వా టాకీసుకు ఒక రజతపాత్రను బహూకరించారు. నేషనల్ ఆర్ట్ థియేటర్స్ నిర్మాత శ్రీ నందమూరి త్రివిక్రమరావు, సంగీత దర్శకుడు శ్రీ టి. వి. రాజుకూడా సన్మానసభకు వచ్చారు.

ఆరోజునే కవిటములో శ్రీ దాట్ల బలరామరాజు శ్రీ కరినరసిరెడ్డి శ్రీ రామారావు గౌరవార్థం విందుచేశారు.

*   *   *

## తమిళంలో "తెనాలి రామన్"

ఆంధ్రలో విజయవంతంగా నడుస్తున్న "తెనాలి రామకృష్ణ" తమిళ అనువాదం "తెనాలి రామన్" మద్రాసులో నాలుగు థియేటర్లలో విడుదల అయింది. రామకృష్ణుడుగా శివాజీ గణేశన్, ఇంకా భానుమతి, జమున, నాగయ్య, నంబియార్ మున్నగువారు ఈ చిత్రంలో నటించారు. దర్శకుడు, నిర్మాత బి. ఎస్. రంగా.

## రష్యాకొన్న భారత చిత్రాలు

సోవియట్ రష్యాకొన్న భారతీయ చిత్రాలలో శాంతారామ్ నిర్మించిన తీన్ బత్తీ చార్ రాస్తా, బిమల్ రాయ్ చిత్రం నౌక్రీలు రష్యన్ భాషలోకీ, సోవియట్ యూనియన్‌లోని ఇతర భాషలలోకి డబ్ చేయబడుతున్నాయి. వీటిని రెండు మూడు నెలలో విడుదలచేస్తారట. మీర్జాగాలిబ్, శ్రీ 420, మిస్టర్ అండ్ మిసెస్ 1955 చిత్రాలను కొనాలని కూడా రష్యా సాంస్కృతిక శాఖ ఆలోచిస్తున్నదట.

★



## ఐజెన్ స్టీన్ తొమ్మిదవ వర్ధంతి



కల్లడిచేశాడు. చిత్రాలమీద నేకాక, చలనచిత్రకళపై వ్రాసిన తాత్త్విక గ్రంథాలపై కూడా ఆయనకీర్తి ఆధారపడివున్నది.

ఇప్పుడు సామాన్యంగా తయారయే చలనచిత్రాలన్నీ నాటక ఫక్కీలో తయారవుతున్నాయి. నాటకానికీ, సినిమాకూ ప్రధాన భేదాలనేకం ఉన్నాయని మొదటగా ఐజెన్‌స్టీన్ నిరూపించాడు. జె. బి. ఎస్. హాల్డేన్ ఒకచోట ఇలా వ్రాశాడు: "ఉదాహరణకి ఒక గుడ్డివాడు, ఒక చెవిటివాడు మాక్ బెత్ నాటకం (షేక్స్పియర్) అలెగ్జాండర్ నెవ్‌స్కీ చిత్రం (ఐజెన్ స్టీన్) చూడడానికి వెళ్ళారనుకుందాం. చెవిటివానికి ఆ నాటకం అర్థంకాదు. డంకన్‌ను ఎవరు చంపారో తెలియక పోవడమే కాదు, అసలు చంపినట్లుకూడా తెలియదు. కాని అంధుడికిమాత్రం నాటకం పూర్తిగా అర్థమవుతుంది. షేక్స్పియర్ నాటకంలో సంభాషణలే ప్రధానం. కాని సినిమాలో అలాకాదు...ఐజెన్‌స్టీన్ చిత్రంలో మాటలు ముఖ్యం కానేకాదు"

చలనచిత్రాల పరిణామంలో ప్రముఖపాత్ర వహించిన ఐజెన్‌స్టీన్‌కు ప్రపంచ చలనచిత్రకారులు ఎంతైనా ఋణపడి ఉన్నారు.

★




## పదకొండో అధ్యాయం

చుట్టాలందరూ వచ్చారు. గోపాలం, భార్యా పిల్లలూకూడా వచ్చారు. ఎవరూ దగ్గర లేనప్పుడు గోపాలం చెల్లెలి దగ్గర చేరి మెల్లగా అన్నాడు: "అమ్మాయీ, నీకు నేను చాలా ద్రోహం చేశానమ్మా. నా స్వార్థం చూసుకొని, డబ్బుకోసం ఆశ పడి నిన్ని గతికి తెచ్చాను. అతను డబ్బు ఇచ్చిందీలేదు. అతని గొప్ప అంతా కేవలం పై పై నాటకమని నేను మొదట్లో తెలుసు కోలేకపోయాను—" అంటూంటే కమల అన్నగారికేసి కటువుగా చూసి "అన్నయ్యా అలాంటి విషయాలేమీ తలపెట్టకు ఇప్పుడు. ఆయనను గురించికూడా ఏమీ వినడం నాకు బొత్తిగా ఇష్టంలేదు" అని చెప్పేసింది. గోపాలం చెల్లెలికేసి వింతగామాసి మళ్ళీ అన్నాడు: "అది సరేనమ్మా, అతని కటువంటి వ్యాధి వచ్చినప్పుడు ఏ ఆసుపత్రిలోనో చేర్పించి నీవు దూరంగా ఉండవలసింది. ఎందుకు కూడా ఉన్నావు? ఎప్పుడెలా ఉంటుందో ఎవరు చెప్పగలరు?" కమల నిర్లక్ష్యంగాచూస్తూ "నాకేమీ భయం లేదులే అన్నయ్యా. నేను చాలా జాగ్రత్తగానే ఉన్నాను" అంది. వదినగారు కమల నీ స్థితికి తీసుకురావడంలో తన కెక్కువ పాలుందనే భావంతో కమలకు కనబడకుండా తప్పించుకు తిరుగుతోంది. వచ్చినప్పుడు రెండు మూడు ఓదార్పు మాటలు మాత్రం చెప్పింది. ఇంట్లో పనులు చూడసాగింది. కమల అన్నగారిచేత సరుకులన్నీ తెప్పించి కర్మ ఏర్పాట్లు చేయించింది. ధైర్యంతో కర్మకాండఅంతా యథావిధిగా జరిపించింది. ఆమె ధైర్యంమాసి చుట్టాలొకరి చెవు లొకరు కొరుక్కున్నారు: "ఈ విడ్డూర మేమిటమ్మా. కంట కన్నీరులేదు. గట్టిగా ఏడుపులేదు" అంటూ. వాళ్ళ దృష్టిలో ఊరందరికీ వినిపించేటట్లు ఏడిస్తేనేకాని ప్రేమ ఉన్నట్లు ఋజువు కాదు.

వచ్చినవారందరూ వెళ్ళిపోయారు. కమల ఒక్కతే అయిపోయింది. మొదట కొన్నాళ్ళు ఆమెకు ఏమీ తోచలేదు. వెనుకటి గాథ తలచుకుంటూ కన్నీరు పెట్టుకుంటూ కూర్చుండిపోయింది. ఓపిక ఉన్నప్పుడు వంట చేసుకునేది. లేనప్పుడు తిండి లేకుండా నేమాసేది. ఊళ్ళో వారెవరూ ఆమె దగ్గరకి రావడం లేదు. సూర్యనారాయణ రావుగారి భార్య మాత్రం ఒకటి రెండు మార్లు వచ్చి కాసేపు కూర్చుని వెళ్ళిపోయింది. రాత్రిళ్ళు ఒంటరిగా గడపడం కమలకు భయం వేయసాగింది. భర్త గదిలో తారట్లాడుతున్నట్లూ, దగ్గుతున్నట్లూ అనిపించేది. అంతకుముందు పనిచేసిన దాసీ మనిషిని తనకు సాయంగా పడుకోమని కోరగా ఆ మనిషి వచ్చి వసారాలో పడుకో సాగింది.

మెల్లగా ఆ భయమూ ఆ స్తబ్ధతా తొలగిపోయాయి. కమల మళ్ళీ తన పరిస్థితిని గురించి ఆలోచించసాగింది. ముందేమిటి? ఇలా ఇక్కడ చేతిలో ఉన్న డబ్బు మార్చుకు తింటూ కాలక్షేపం చేయడమేనా? చేతిలో పన్నెండు వందలూ ఎన్నాళ్ళని వస్తాయి? మహావస్తే ఏణర్ధమో రెండేళ్ళో ఆపైన? అయినా తనకీఊళ్ళో అంత ముఖ్యులెవరున్నారు? తనకీ ఊరు పట్ల అభిమానమేమిటి? ఇక్కడకన్న మళ్ళీ బెజవాడే వెళ్ళితే ఏ ఉద్యోగమో చూచుకొని జీవితం గడపవచ్చు. కాని ఉద్యోగం దొరుకుతుందా?—అంతలో భర్త చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది. ఈడబ్బు పెట్టి బి. ఏ. చదువుకో అని చెప్పాడు. అవును, చిన్ననాటినుంచీ ఉన్న అభిలాష తీరనేలేదు. కాని తానీ పన్నెండు వందలతో బి. ఏ. చదవగలదా? లెక్కవేసి చూసుకుంది. కాలేజీజీతానికీ, పరీక్షురుసుముకీ, పుస్తకాలకీ కలిపి ఆరు వందలు తప్పనిసరిగా ఖర్చు అవుతుంది. ఇక మిగిలేది ఆరువందలు. ఆ ఆరు వందలమీద తను రెండేళ్ళు గడపాలి. అంటే నెలకు పాతిక రూపాయిలమీద గడపాలన్న మాట. అద్దెకే నెలకు పదిహేను రూపాయలు అయిపోతుంది. పదిరూపాయలమీద తిండికీ గుడ్డకీ గడిచేదెలా? కొన్ని ప్రైవేట్లు చూసుకుంటే పరవాలేదు గడపవచ్చు ననుకుంది. తను బి. ఏ. చదవగలదు. తనకోరిక నెరవేర్చుకోగలదు. ఆమె హృదయంలో తిరిగి ఉత్సాహం లేవసాగింది. తనకీ అవకాశం కలుగజేసిపోయిన భర్తను తలచుకుని కన్నీరు నింపుకుంది.

బెజవాడ చేరింది. రత్నమ్మగారు తిరిగి రాలేదు. ఆమె ఇంట్లో ఖాళీలేదు. ఆమె అదివరకుండే వాటాకూడా అద్దెకిచ్చివేయబడింది. కమల ఇతరుల ఇళ్ళు చూసింది. చివరకు పదిరూపాయల కొకగది కుదుర్చుకుంది. గది చిన్నది. అదే వంటిల్లుక్రిందా, హాలు క్రిందా వాడుకోవాలి. స్నానానికి యింటి కంతటికీ రెండే గదులున్నాయి అయినా డబ్బు జాగ్రత్తగా వాడుకోవలసిందృష్ట్యా అదే తీసుకుంది. తరువాత ప్రైవేట్లకోసం తిరిగింది పది రూపాయలకు సాయంత్రం ఒకగంట ఇద్దరు పిల్లలకు ప్రైవేటు చెప్పడానికి ఒప్పుకొని వచ్చింది. తక్షణావసరాలకు కావలసిన డబ్బుమాత్రం దగ్గర ఉంచుకొని మిగిలినది బాంకులో వేసింది. కాలేజీకి అప్లికేషను పెటింది జీతంకట్టి బి. ఏ. "ఎకనమిక్సు" గ్రూపులో చేరింది. కొన్ని అత్యవసరమయిన పుస్తకాలు కొనుక్కుంది. మిగిలినవి లైబ్రరీలో నే చదివి నోటూలు పడాలనుకుంది. కాలేజీలో పాఠాలు ప్రారంభమయ్యాయి. నాలుగురోజులు కాలేజికి వెళ్ళి వచ్చేసరికి వెనుక ఇంటర్మీడియేట్ చదివిన రోజుల్లో ఉండే ఉత్సాహం తిరిగి బయలుదేరింది. మళ్ళీ బాల్యదశ వచ్చినట్లయింది.

ఆమె ఊళ్ళో తిరుగుతున్నప్పుడు రఘూ, సుశీలా, వెంకటలక్ష్మమ్మగారూ వగయిరా లప్పుడప్పుడు తటస్థపడేవారు. కాని వాళ్ళకు కనిపించకుండా ఆమె తప్పుకుని వెళ్ళిపోయేది. సుశీల, పిల్లలు విడిగా వెళ్లుతున్న

ప్పుడు మాత్రం వాళ్లను దగ్గరకు పిలిచి, ఎత్తుకుని ముద్దాడి, బిస్కట్లో మిఠాయీలో కొని పెట్టి పంపేది. వాళ్ళను చూసి సుశీల అదృష్టం తలచుకోగా ఆమె హృదయంలో అసూయకూడా రేకెత్తేది. వాళ్లకేసి చూస్తూ ఉండిపోయేది. సీతారామయ్యగారు ఒకరోజున ఆమెను చూసి కూడా వచ్చి అన్ని విషయాలూ తెలుసుకుని, విచారం ప్రకటించారు. ఆమె బి. ఏ. చదువుతున్నందుకు చాలా సంతోషించి ప్రోత్సహించారు. అది మొదలుకొని వారానికొక్కరోజేనా వచ్చి ఆమె క్షేమ సమాచారం తెలుసుకొని వెళ్తున్నారు.

ఆవేళ కాలేజీలో విద్యార్థిసమితి ప్రారంభోత్సవం. కమల సభకు హాజరై ప్రొద్దుపోయిన తరువాత యింటికి వెళ్ళింది. గుమ్మంలో అన్నగారు కూర్చుని వున్నాడు. అన్నగారిని చూసి ఆమెకు సంతోషం కలగలేదు. మళ్ళీ యెందుకు వచ్చాడో! అయినా యేమీ మాట్లాడకుండా తలుపుగొళ్లెం తీసి లోపలకు వెళ్ళి వంటచేసి అన్నగారికి పెట్టి తను తింది. తరువాత "యెందుకు వచ్చావన్నయ్యా" అని ఆమే అడిగివేసింది. "ఏముందమ్మా, నీ విక్కడ ఉన్నావుగదా. నీతోబాటు నేనుకూడా ఇక్కడే యేదో పని చూసుకొని బ్రతుకుదామనివచ్చానమ్మా. మా మామగారింటో ఉండడం నాకు తల కొట్టేసినట్లుంటోంది. కొట్టుపని అంతా చూసి పెట్టున్నా తాము నన్ను పూరికే పోషిస్తున్నట్లు బాధపడతారు. నౌకరులా అన్నిపనులూ చేయించుకుంటారు. ఒక్క మాట అనడానికి వీలులేదు. చేతకానితనానికి పౌరుషంకూడానా అని ఆక్షేపిస్తారు. పైగా మీవదిన నాకున్న కొద్ది గౌరవమూ కూడా లేకుండాచేసింది. నాకు వినపడేటట్లుగానే తండ్రితో 'నాకీ సంబంధం చేసి నన్ను గోతిలోపడేశావు. అందరి మొగుళ్లూ ఉద్యోగాలు చేస్తూ పెళ్ళాం పిల్లలతో సుఖముగా ఉంటున్నారు నా మొగుడు తిననే పోషించుకోలేకపోతే నన్నేమి సుఖపెడతాడు' అని అంటోంది. ఇక ఆ యింట్లో యెలా వుండగలనమ్మా. అలాంటి మాటలనే దాని మొగం యెలా చూడగలనమ్మా. ఇక్కడే ఏదో పని చూసుకుంటాను. నీకిక్కడ కొందరు పరిచయస్తులుంటారుగదూ. వారిద్వారా యేమైనా పని దొరుకుతుందేమో ప్రయత్నించవచ్చు ఆ యింట్లో వారి దయాదాక్షిణ్యాలమీద బ్రతుకుతూ వారి ఈసడింపులు సహించేకన్న కూలి చేసుకుని బ్రతికినా మేలే" అన్నాడు గోపాలం నిట్టూరుస్తూ.

కమల అన్నగారిస్థితికి జాలిపడకుండా ఉండలేకపోయింది. "కాని అన్నయ్యా నాకీ ఊళ్లో నీకు పనిదొరికేటట్లు చేసే పరిచయస్తు లెవరున్నారు? తిన్నగానే ప్రయత్నంచేసుకుంటే మంచిదేమో" అంది. సరే నేనే వెళ్ళి చూసుకుని వస్తాను" అని మర్నాడు ప్రొద్దున్న గోపాలం ఊరి సంచారానికి బయలుదేరాడు. సాయంత్రం కమల కాలేజీనుంచి తిరిగివచ్చే వేళకు కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరుకున్నాడు. వెళ్ళిన పని కాలేదని అతని ముగమే చెపుతోంది. మర్నాడూ అలాగే అయింది. కమల అన్నగారికోసం తీవ్రంగా ఆలోచించింది; ఏ విధంగా ప్రయత్నిస్తే అతనికి పని దొరుకుతుందా అని మర్నాడు సీతారామయ్యగారు వచ్చినప్పుడు అన్నగారిపరిస్థితి వివరించి చెప్పి ఆయన సహాయం కోరింది. "బడిపంతుల్ని నేనేం సాయంచేయగలనమ్మా. నాకు మాత్రం పలుకుబడిగల పరిచయస్తు లెవరమ్మా" అని కూర్చొని చాలాసేపు ఆలోచించారు. చివరికిలా అన్నారు. "నేనొకటి చెపుతాను. మీరు మరోలా భావించరు గదా" అని. "అయ్యో అలా ఎందుకనుకుంటాము౦డి. చెప్పండి, అందు కాక్షేపణ ఏమిఉండ"దన్నాడు గోపాలం. "అది కాదు లేనాయనా, నేనొక పనిచేయమని సలహా చెపుదామనుకున్నాను. కాని అది మీరు మీగౌరవానికి లోపమని భావిస్తారేమోనని నాభయం," అన్నారు. కమలా గోపాలం ఆయన ఏం చెపుతారో అని ఎదురుచూడసాగారు. "నాయనా, నీవు



ఒక హోటలు పెడితే బాగుంటుందని నా అభిప్రాయం" అన్నారు సీతారామయ్యగారు చివరికి. కమలా, గోపాలం ఉలిక్కిపడ్డారు. "అవునమ్మా హోటలు పెట్టటమంటే ఏదో తక్కువగానే కనిపించవచ్చు. కాని అందులో తప్పేముందమ్మా, దీనికి పెట్టుబడి తక్కువ. ఎవరి చేతిక్రిందా ఉండనక్కర్లేకుండా స్వతంత్రంగా బ్రతకవచ్చు. మొదట్లో ఏదో పాకతీసుకుని కొద్ది రకాల ఫలహారాలతో, కాఫీటీలతో, ప్రారంభించవచ్చు. క్రమంగా లాభంవచ్చిన కొద్దీ శుభ్రమైన ఇల్లుతీసుకుని పెద్దహోటలు పెట్టవచ్చు. రేపు బాగా డబ్బు గడించావంటే నీ చుట్టూ అందరూ తిరుగుతారు బాబూ. ఈ సంఘంలో డబ్బుకే గౌరవం, నాయనా. డబ్బుంటే చాలు, వాడు బ్లాక్ మార్కెట్ చేసి గడించినవాడైనాసరే వాడికి సంఘంలో ఉన్నతస్థానమే. ఏం నాయనా, ఏమంటావు? నాకు తోచింది చెప్పాను. అందుకు నామీద మనస్సులో కోపం పెట్టుకోకండి. అన్నా చెల్లెళ్ళిద్దరూ ఆలోచించండి" అన్నారు సీతారామయ్యగారు

గోపాలం ఆయన చెప్పినట్లే చేస్తానన్నాడు. హోటలు ఎలా ప్రారంభించాలి, ఎంత పెట్టుబడి పెట్టాలి, ఏమేమి కొనాలి, మొదలయినవి చర్చించారు. ఇంటిప్రక్కతాటాకుపాకఅద్దెకు తీసుకుని కొన్ని బల్లలూ కుర్చీలూ, వంటసామగ్రీ, కప్పులూ, ప్లేట్లూ కొనాలి. ఒక కుర్రవాడిని పెట్టుకోవాలి. కనీసం రెండువందలేనా పెట్టుబడివుండాలి. పెట్టుబడి ఎక్కడినుంచి వస్తుందన్న ఆలోచనలో పడ్డారు గోపాలం, సీతారామయ్యగారు. తన డబ్బులోనుంచి యిస్తానంది కమల. "హోటలు నిలబడింది అంటే యేదో కొంత డబ్బు రాకపోతుందా? పెట్టుబడేనా తిరిగి రాకపోతుందా?" అంది. బాగుందన్నారు సీతారామయ్యగారు. ఆ డబ్బు తీసుకుని హోటలుకు ఏర్పాట్లు చేయసాగారు. పాక అద్దెకు తీసుకున్నారు. సీతారామయ్యగారూ, గోపాలం కలిసి బజారుకు వెళ్ళి వంటసామగ్రి దినుసులు కొన్నారు. ఒక కుర్రవాడిని కూడా కుదిర్చారు. ఒకరోజు శుభముహూర్తాన సీతారామయ్యగారే నలుగురు స్నేహితుల్ని తీసుకువచ్చి గోపాల్ విలాస్‌కు ప్రారంభోత్సవం చేశారు. అప్పటినుంచి కనపడ్డ వారితో "ఆయన ఎవరో హోటలు పాకలో పెట్టాడుకాని, ఇడ్లీ తింటే అక్కడే తినాలి. వహ్వా, ఆ సాంబారు రుచి ఏమిటి? అచ్చు అరవవాళ్లు చేసినట్లుంటుంది. కాఫీ టీలో ఆ రుచి ఎక్కడా రాదు" అంటూ ప్రచారం చేయసాగాడు ఆయన.

కమల సాయంత్రం ప్రైవేట్లు చెప్పి రాత్రి చదువుకుంటోంది. చీకటితోనే లేచి పిండి రుబ్బి అన్నగారికి యిస్తోంది. గోపాలం కుర్రవాడి సాయంతో ఇడ్లీలూ అవీ చేసి తయారు చేసుకునేవాడు. సీతారామయ్యగారి ప్రచారంవల్లనైతేనేమి, వంటకాల రుచివల్లనైతేనేమి హోటలుకు నలుగురూ రాసాగారు. హోటలు బాగా నడుస్తోంది. ఇప్పుడు వచ్చే ఆదాయంలోనుంచి ఒక్కపైసా అయినా వాడక హోటలును మరికొంత అభివృద్ధి చేయాలనుకున్నాడు గోపాలం. బాగా పేరు వచ్చిన తరువాత మంచి ఇంట్లోకి మార్చి చక్కని టేబుల్సూ కుర్చీలూ వగైరాలు పెట్టి ఆకర్షణీయంగా చేయాలి అనుకున్నాడు. ఇక తను గొప్ప హోటలుయజమాని కావడం తప్పదని ఉప్పొంగసాగాడు.

రఘు ఇప్పుడు తిరిగి ప్రేమకవిత్వమే రాస్తున్నాడు. కాని ఆ రచనలన్నీ క్రమం తప్పక తిరిగి వస్తున్నాయి. అతను పెద్దగా బాధపడడంలేదు. తన సుశీల ఇప్పుడు తన అభిరుచుల కనుగుణంగా నడుచుకొంటూ ఉండడం అతనికి ఇతర చింతలేమీ లేకుండా చేసింది. తన భార్యను చూసి గర్వం కూడా పొందసాగాడు. కాని అప్పుడప్పుడు కమల పట్ల తాను చేయబోయిన ప్రయత్నం జ్ఞాపకం వచ్చేది. తన సుశీలా, ఇరుగు పొరుగులవాళ్లూ తనపంతిగా నిందించలేదు. తనను చెడగొట్టడానికి ప్రయత్నం చేసిందని ఆ కమలనే నిందించారు. నిజంగా దోషి అయిన తను తప్పించుకొని అమాయకురాలైన కమల నిందకు గురికావడం తలచుకొని అతను లోలోన చాలా సిగ్గుపడుతున్నాడు. ఎప్పుడైనా కమల దూరంగా కనిపిస్తే కంగారుగా సుశీలతోబాటు ప్రక్కవీధిలోకి వెళ్ళిపోతున్నాడు. కాని ఆ వేళ భార్యాబిడ్డలతో షికారు వెళ్తూంటే పాపా సుకుమార్ లు వాళ్లకు కమల ఇల్లు గుర్తుంది కాబట్టి, తల్లి చేతులు పట్టుకుని "అమ్మా ఇట్లారా" అంటూ కమల గదిలోకి లాగుకు పోయారు. సుశీలను వాళ్లెక్కడికి తీసుకు వెళ్తున్నారో తెలియకవాళ్ళు తీసుకుపోయినట్లే నడిచింది. రఘు పిలలు సుశీలను కమల ఇంట్లోకి లాగుకు పోతూండడం చూసి, ఏమవుతుందో ఏం పరిస్థితి వస్తుందో అనే భయంతో ఏమీ తోచక వీధిప్రక్కనున్న కొట్టు లోకి పోయి నిరీక్షించసాగాడు.

సుశీల లోపలికి వెళ్లేవేళకు కమల అన్నగారితోబాటు కూర్చుని ఉంది. ప్రక్కన పుస్తకం తెరచిపెట్టుకుని అది చదువుతూనే మినుములలో బెడ్డలు ఏరుతోంది. సుశీలను అకస్మాత్తుగా చూసి నిశ్చేష్టురాలై పోయింది. సుశీల కమలను చూసి స్తంభించిపోయింది. చెల్లెలితో మాట్లాడడానికి ఎవరో వచ్చారని గోపాలం బయటకు నడిచాడు. కమల తెల్లబోతూనే ఉంది. కూర్చోమని కాని, ఎందుకు వచ్చారు అని కాని అనలేకపోయింది. అలాగే లేచి నిలబడింది. పాపా సుకుమార్ లు తల్లి చేతులు వదిలి కమల దగ్గరకు పరుగెత్తివచ్చారు. "ఏమండీ! మా అమ్మను మీయింటికి తీసుకువచ్చాం చూశారా. అమ్మ ఈవిడేనమ్మా మాకు బొమ్మలు కొనిపెట్టింది. మాకు రోజూ బిస్కట్లూ, చాక్‌లెట్లూ పెట్టింది" అంటూ కమలను చుట్టివేశారు. కమల వాళ్లను చెరో చంకను ఎత్తుకుంది. ఆమెకేమీ తోచడంలేదు. ఏం చేయాలో, ఏం మాట్లాడాలో, ఏమి మాట్లాడితే ఏమనుకుంటుందో అని భయం. ఏదో ఉద్దేశ్యంతోనే తనంతట తానే వచ్చిఉంటుందని అనుకొని సందేహంతో నిలబడిపోయింది. తల్లీ, కమలాకూడా అలాగే కొయ్యబొమ్మలలా నిలబడిపోయి ఉండడం చూసి పిల్లలుకూడా ఆశ్చర్యంతో ఇద్దరి మొగాలూ చూస్తూ మౌనంగా ఉండిపోయారు. వాళ్ళిద్దరూ ఎంతసేపలా నిలబడిఉండేవారో సీతారామయ్యగారు సమయానికి రాకపోతే. ఆయన సుశీల అక్కడ ఉండడం చూసి ఆశ్చర్యపోయి వెంటనే పరిస్థితి గ్రహించి కమలతో "ఏమిటమ్మాయీ, ఇంటికివచ్చిన ఆమెను కూర్చోబెట్టక అలా నిలబెట్టే ఉంచావేమిటమ్మా? ఇంత చదువుకున్నదానివి, ఇదేనా మర్యాద" అని మందలించారు. కమల కంగారుగా పిల్లలను దింపి చాపపట్టుకువచ్చి పరచి "కూర్చోండి" అంది సుశీలను. సుశీల సందేహిస్తూండగా "కూర్చో తల్లీ, చెల్లెలిలాంటిది కూర్చోమంటే ఆలోచించనక్కరలేదు. కూర్చో" అన్నారు సీతారామయ్యగారు. సుశీల కూర్చుంది. కమలకూడా

కూర్చుంది. పిల్లలిద్దరుమధ్య కూర్చున్నారు. సీతారామయ్యగారు అక్కడఉన్న పెట్టెమీద కూర్చుని "నీ విక్కడకు వచ్చినందుకు చాలా సంతోషంగా ఉందమ్మా. నీవెప్పుడో అప్పుడు నీఅంతట నీవే ఇక్కడకు వస్తావని నాకు తెలుసు. నీ స్నేహంకోసం ఎదురు చూస్తోంది ఈకమలమ్మ. నా తల్లి చిన్నతనంలోనే అన్నీ చూసివేసింది. దాంపత్య సౌఖ్యమైనా ఎక్కువకాలం పొందకుండా భగవంతుడు విడదీశాడు. కష్టాలే ఆమె పరమయ్యాయి." అన్నారు. భర్తమాట వినగానే కమలకు కళ్ళనీళ్లు తిరిగాయి. చటుక్కున ముఖం ప్రక్కకు వంచుకుంది. కాని సుశీల గమనించనే గమనించింది. గోపాలం సీతారామయ్యగారి వెనకే లోపలికి వచ్చి గుమ్మం దగ్గరే నిలబడి "మేమేనండి, మా స్వార్థం చూసుకుని మా చెల్లెలి నీగతికి తీసుకువచ్చాం" అంటూంటే కమల అన్నగారికేసి తీవ్రంగా చూసి "అన్నయ్యా" అని కేక వేసింది. ఈయనెవరా అని సుశీల పరిశీలిస్తూండగా సీతారామయ్యగారే "ఈయన కమల అన్నగారమ్మా, పేరు గోపాలం. ఇక్కడ చిన్న హోటలు నడుపుతున్నాడు. నేనే చేశాను ఆ సూచన. నా సూచన బాగుందంటావా లేదంటావా?" అన్నారు నవ్వుతూ. సుశీల మెల్లగా కమలచేతులు పట్టుకొని "వెనక జరిగిన దానికి చాలా బాధపడుతున్నానండి. నన్ను క్షమించండి" అంది. కమల కన్నీటితో నిండిన కళ్లతో "అదేమిటి. నాకు జ్ఞాపకం లేదండి. మీరు నన్ను స్నేహభావంతో చూస్తే అంతే చాలు." అంది. సీతారామయ్యగారు సుశీలతో "వెనక జరిగినదానికి పరిహారంగా నీ పిల్లల్ని రోజూ సాయంత్రం ఒక గంటసేపు ఈవిడదగ్గరకు పంపుతూండమ్మా" అని లేచి గోపాలంతో "ఎలాఉంది మనహోటలు" అంటూ హోటల్ విషయం మాట్లాడుతూ బయటికి నడిచారు. సుశీల సందేహిస్తూ "మీరు మాపిల్లలకి ట్యూషను చెప్పడానికి వీలవుతుందా" అని అడిగింది. "సంతోషంగా చెపుతాను కాని డబ్బు పుచ్చుకోను మరకుమీద" అంది కమల. సుశీల నవ్వుతూ లేచి నిలబడి "అలాగే పంపిస్తానండి రేపటినుంచి" అంది. కమల ఆమె దగ్గరకు వచ్చి "నన్ను అండీ అనకండి. నేను మీకన్న బాగా చిన్నదానిని. నేను మిమ్మల్ని అక్కా అని పిలవడానికి ఒప్పుకుంటే" అంటూండగా సుశీల ఆమె కళ్ళలోకి చూసి చటుక్కున కౌగలించుకొని "అలాగే పిలు, చెల్లీ" అని మెల్లగా సెలవుతీసుకుని వెళ్లిపోయింది. సుశీలస్నేహం సంపాదించడం ఒక ఘనవిజయంగా తోచింది కమలకు. సంతోషంతో ఆమెగుండె నిండిపోయింది.

గోపాలం హోటలంటే నలుగురికీ తెలిసింది. రోజూ ఎలా లేదన్నా పది రూపాయలవరకూ అమ్మకం జరుగుతోంది. సీతారామయ్యగారూ, గోపాలం ఇద్దరూ హోటలు నభివృద్ధి చేసేందుకు పద్ధతు లాలోచించసాగారు. కాని వారి ఆశలన్నీ కొద్ది రోజుల్లోనే తలక్రిందులయ్యాయి. ఆ వీధిలోనే చాలా కాలంనుంచి ఉంటున్న రెండు హోటళ్ళ యజమానులు తమ హోటళ్లలో జనం తగ్గిపోతూఉండడం, గోపాల్ విలాస్‌లో పెరుగుతూండడం చూసి భయపడి రేట్లు తగ్గించారు. వారితోబాటు గోపాలం కూడా రేట్లు తగ్గించవలసివచ్చింది. హోటలు పెట్టిన కొద్ది కాలమే కావడంవల్ల తక్కువ రేట్లకు అమ్మడం చాలా నష్టంగా ఉంది. అయినా ఏంచేస్తాడు. అవతల హోటళ్ళ వాళ్లు అలాగే నిలబడ్డారు. చివరికి గోపాల్ విలాస్ దివాలా తీసింది.

## పన్నెండో అధ్యాయం

మళ్ళీ ఆలోచనలో పడిపోయారు ముగ్గురూ. సీతారామయ్యగారు తనకే ఈ దెబ్బ తగిలినట్లు బాధపడసాగారు. తనవల్లే గోపాలానికి ఈ స్థితి వచ్చిందనుకున్నారు. సొంతవ్యాపారం లాభం లేదని గోపాలం మళ్ళీ ఊళ్లో పనులకోసం వెదకడం అరంభించాడు. సీతారామయ్యగారుకూడా గోపాలం వెంట తిరుగుతున్నారు. అయినా ఫలితం శూన్యం. నాలుగు రోజులయింది. వారం రోజులైంది. అయినా గోపాలానికి దగ్గరలో పనిదొరికే సూచనలేమీ కనిపించలేదు. గోపాలం పూర్తిగా నిరాశచెంది చెల్లెలితో అన్నాడు: "అమ్మాయీ నేను మరో వూరు పోతాను. ఎక్కడైనా పని దొరకవచ్చు. ఇక్కడ నీకు భారంగా వుండడం నాకు చాలా కష్టంగా ఉందమ్మా." అలాంటి భావాలు ప్రకటించినందుకు కమల అన్నగారిని కోపపడి సీతారామయ్యగారు వచ్చిన తరువాత ఆయనతో చెప్పింది అన్నగారన్న మాటలు. "ఇక్కడ కాకపోతే మరెక్కడయినా దొరుకుతుందని నమ్మకమేమిటి? ఇక్కడే వుండి ప్రయత్నం చేయి. అన్నా చెల్లెళ్లొక్కచోటే ఉంటే ఒకరికొకరు ఆసరాగా ఉంటారు. నేనేదో ఉపాయం ఆలోచించగలననే అనుకుంటున్నాను. మా ఆవిడ నన్ను ఆలోచించుకోవడానికి అవకాశ మిచ్చినప్పుడల్లా నీ విషయమే ఆలోచిస్తున్నాను నాయనా. ఏదోఒక ఉపాయం త్వరలో చెప్పగలననుకుంటున్నాను" అన్నారు సీతారామయ్యగారు.

మరి రెండు రోజులకు ఆయనకొక ఆలోచన తట్టింది. రాత్రి తొమ్మిది గంటలకు కమల యింటికి పరుగెత్తుకు వచ్చారు. రాత్రివేళ యెందుకు వచ్చారా అని ఆశ్చర్యపోతూ తలుపు తీసింది కమల. "నాకొక ఆలోచన తట్టిందమ్మా. వెంటనే చెప్పివేస్తేనే కాని ఉండలేకపోయాను. నీవొక కిరాణా కొట్టు పెడితే బాగుంటుంది నాయనా" అన్నారు సీతారామయ్యగారు. కమలా గోపాలంల మొగాలు వెలవెలబోయాయి. అయినా వారి మొగంలో మార్పు గమనించక సీతారామయ్యగారు చెప్పుకుంటూనే పోయారు. "ఈవీధిలో దగ్గర కిరాణాకొట్లు లేవు. అందువల్ల దగ్గరఉన్న వాళ్లు నీదగ్గరకే వస్తారు. సరుకు నాణ్యమైనది తెప్పించి, నమ్మకంగా అమ్మితే చుట్టుపక్కలవాళు నీదగ్గరే కొంటారు. ఈకొట్టుకు హోటలు పోటీవంటిదేమీ ఉండదు. రేట్లు తగ్గించడంవంటివేమీ ఉండవు. మొదట్లో పెద్దలాభాలు రాకపోయినా నష్టంమాత్రం రాదు. కాని క్రమంగా అదే పెద్ద వ్యాపారంగా పెంచవచ్చు. ఇప్పుడు పెద్ద పెద్ద మేడలు కట్టినవాళ్ళంతా ఆదిలో ఇట్లా ప్రారంభించినవారే. మొదట నాలుగు నెలలకు సరిపోయే సరుకు తెచ్చి అమ్మకం మొదలు పెట్టవచ్చు." గోపాలం ఆయన చెప్పింది బాగానే ఉందన్నాడు ఏదో ఒక దారి దొరికితే చాలునన్నట్లు. మరి పెట్టుబడో? వేయి రూపాయలేనా పెట్టుబడి కావాలి. అంత పెట్టుబడి ఎక్కడనుంచి వస్తుంది? చివరికే సమస్యే పెద్ద సమస్యఅయి సీతారామయ్యగారు ఆశాభంగంతో వెనక్కి మళ్లారు.

ఆయన మళ్లీ మర్నాటి సాయంత్రానికి కాని రాలేదు. అప్పటికి కమల అన్నగారిని గురించి తీవ్రంగా ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చివేసింది. "నేను చదువు మానివేస్తా

మంచి. ఆ డబ్బు పెట్టి యీ కొట్టు నడపవచ్చు. నేను బి. ఏ. చదివినా చివరికి ఉద్యోగం కోసమే గదా. ఆ ఉద్యోగం ఇప్పటినుంచే చేస్తాను. జ్ఞాన తృష్ణ తీర్చుకుందుకు కాలేజీల్లోనే చదవ నక్కర్లేదని ఇప్పుడు తోస్తోంది నాకు. స్వయంగానే చదువుకోవచ్చు. బి. ఏ. చదివిన తరువాతనైతే ఎక్కువ జీతం ఉద్యోగం దొరకవచ్చు. అధికాదాయం ఎవరి కోసం? నాకెవరున్నారు మా అన్నయ్య తప్ప. అటువంటప్పుడు మా అన్నయ్యకు మంచి జీవనాధారం చూపడంకన్న నా కేం కావాలి," అంది.

గోపాలం చెల్లెలికేసి చూసి కంట తడి పెట్టాడు. సీతారామయ్యగారు కొంతసేపుండి అన్నారు "వద్దమ్మా, చదువు మానవద్దు. వయస్సులో వచ్చిన అవకాశం పోగొట్టుకుంటే ఆపైన తిరిగి చదువుదామన్నా కష్టమవుతుంది. చదువు మానవద్దు. కాని కాలేజీ జీతాలకీ, పరీక్షా రుసుముకీ కాక ఏమీ మిగలదా నీవద్ద. కోటలు ఎత్తివేసినప్పుడు మిగిలిన నూట యాభైతో కలిపితే కొంత సరిపోవచ్చు నేమో."

"చదువుకు కాక మూడువందలయాభైపైన ఉన్న"దంది కమల. "సరే మొత్తం అయిదు వందలు పెట్టుబడి పెట్టవచ్చునన్నమాట. ఫరవాలేదు కొట్టు ప్రారంభించవచ్చు:" అన్నారు సీతారామయ్యగారు. కమల బ్యాంకునుంచి మూడువందలయేభై తెచ్చింది. ఐదువందలూ చూసుకుని కొట్టు ప్రారంభించడానికి కావలసిన యేర్పాట్లలో మునిగారు గోపాలం, సీతారామయ్యగారూ. ఆ ఇంటిలోనే వీధి మీదికి వున్న ఒక చిన్న గది అద్దెకు తీసుకున్నారు. ఇద్దరూ టోకువర్తకుల దగ్గరికి పోయి సరకులు కొని తెచ్చారు. కొట్టు తెరిచేముందు సీతారామయ్యగారు గోపాలాన్ని వెంటబెట్టుకుని ఆ వీధిలో వున్న వాళ్ళందరి దగ్గరికీ పోయి గోపాలం ఆ వీధిలోనే కిరాణా కొట్టు తెరవబోతున్నాడనీ, తమకు కావలసిన సరుకులు అతని కొట్టునుంచే కొనుక్కోవలసిందనీ చెప్పి వచ్చారు. కొట్టు తెరిచారు. సీతారామయ్యగారు తన యింట్లోకి కావలసిన సరుకులన్నీ గోపాలం కొట్టునుంచి కొనుక్కోవడం మొదలుపెట్టారు.

కమల ప్రతినెలా ఖర్చుకుగాను పాతిక రూపాయల చొప్పున వాడుకోవచ్చునను కున్న డబ్బు కొట్టు పెట్టుబడిక్రింద వాడివేయడంవల్ల తన ఖర్చులన్నిటికీ అధికాదాయం సమకూర్చుకుంటేనేగాని గడవని పరిస్థితి యేర్పడింది. తామున్న గది అద్దే, కొట్టు అద్దే. తామిద్దరి భోజనాదుల ఖర్చూ యెదుర్కోవాలి. కొట్టు పెద్ద నష్టమూ లేకుండా, పెద్ద లాభమూ లేకుండా సాగుతోంది. దానిమీద వచ్చే ఆదాయం ఎప్పటికప్పుడు వాడివేసుకుంటే కొట్టు నడవదు కాబట్టి ఆడబ్బు ముట్టుకోడానికి వీలులేదు. ఇప్పుడు ప్రయివేట్లమీద వస్తున్నది పది రూపాయలే. ఇవి గది అద్దెకే సరిపోతున్నాయి. అందువల్ల కమల మళ్ళీ ఊళ్ళో తిరిగి మరొక పదిహేను రూపాయల ప్రయివేటు సంపాదించుకుంది. దీనికితోడు రాత్రిళ్లు రోజుకు రూపాయి చొప్పున ఒక రెడీమేడ్ దుస్తుల కంపెనీలో మూడు గంటలు పని కుదుర్చుకు వచ్చింది. ఈ డబ్బే అతి జాగ్రత్తగా వాడుతూ గడుపుకు వస్తోంది కమల. మొదట్లో కమల ఏమీ బాధపడలేదుకాని పోను పోను శ్రమపడ సాగింది. సాయంత్రం ప్రైవేట్లూ, వంటా, రాత్రి రెడీమేడ్ దుస్తుల కంపెనీలో పని, ప్రొద్దున్న చదువు, వంటా ఆ పైన కాలేజీ ఈ విధంగా నిర్విరామంగా పని చేయడంవల్ల ఆమె చిక్కిపో సాగింది. శ్రమకు తట్టుకోవడం కష్టమైంది. అయినా తన లక్ష్యం చేరుకునేవరకూ బాధపడకతప్పదని పట్టుదలతో కార్యక్రమం కొనసాగించింది.

కొన్నాళ్ళు గడచిన తరవాత ఒకనాడు కమల ఇంటికి చేరుకునేసరికి లోపలినుంచి కేకలు వినబడ్డాయి. ఒక్క ఉరుకులో లోపల పడింది కమల. వదినగారు పిల్లలతో వచ్చి నిలబడిఉంది. గోపాలం కేకలు వేస్తున్నాడు: "నడు బయటికి, ఏ మొగంతో ఇక్కడకి వచ్చావంట! ఇన్నాళ్ళూ మొగుడున్న మాట అసలు జ్ఞాపకం ఉందా! ఊఁ నడు. నీవి యింట్లో ఉండడానికి వీలు లేదు."

"మీరు నాకు చెప్పి వచ్చారేమిటి? అన్నాళ్లూ మా నాన్న మనల్ని పోషించినందు కానా మీదా వాళ్ళమీద కోపం? కట్టుకున్న తరువాత ఎక్కడికి పోతాను? ఇన్నాళ్ళూ ఇంత చేసినా పెళ్ళాం దూరమైంది—చెల్లెలేమో దగ్గరైంది" అంటోంది సూర్యకాంతం తన సాధింపు ధోరణిలో.

దానితో గోపాలం మరింత రెచ్చిపోయాడు. "ఛీ నోరుముయ్యి, దుష్టురాలా. నీవే ఇంత చేశావు. నీవే నా చెల్లెలిని రాజారావుకు ఇచ్చేవరకూ ఊపిరాడనీయలేదు! మా యింట్లో నన్ను తక్కువగా చూస్తున్నా నీవేమీ పట్టించుకోక ఇప్పుడు వచ్చి నిన్ను ఈ యింట్లోకి రానీయమంటావా? అడగడానికి ఎలా సిగ్గు రాలేదంట?" అంటూ కేకలు పెట్టున్నాడు. ఆ కేకలు విని చిన్న పిల్లలిద్దరూ ఏడుపు మొదలుపెట్టారు.

సూర్యకాంతం ఇక తనేం చెప్పినా భర్త వినిపించుకోడని గ్రహించి, కమల వైపుకు తిరిగి "నీవేనా చెప్పమ్మా. మా నాన్న మాత్రం ఎన్నాళ్ళని పోషిస్తాడు నన్నూ, నా పిల్లలినీ—నేను యీ పిల్లలతో ఎక్కడకు పోవాలి. నేనైతే ఏ గంగలోనో దిగుదును, పిల్లల నేమిటిచేయడం?" అని విలపించింది.

అంతవరకూ స్తబ్ధురాలుగా ఉన్న కమల తేరుకొని "అన్నయ్యా వదిన పిల్లలతో ఎక్కడకు పోతుంది? ఈ పిల్లలు ఆమెకే కాదు నీకుకూడాపిల్లలేగదా? వాళ్లను వెళ్ళగొట్టితే వాళ్ళగతేమిటి అన్నయ్యా" అంది.

గోపాలం కొంతసేపు భార్యకేసి తీవ్రంగా చూసి "హూఁసరే" అని చరచరా వీధిలోకి వెళ్లిపోయాడు.

ఇప్పుడు వదినగారు పిల్లలూ వచ్చారు కాబట్టి ఇంతవరకూ ఉన్న గది సరిపోలేదు.

శిథవాటూ తీసుకోవలసివచ్చింది. ఇంటి ఖర్చులు కూడా పెరిగాయి. కొట్టుమీద అమ్మకం కొంచెం పెరగడంవల్ల ఈ అదనపు ఖర్చును ఎలాగో ఎదుర్కొగలిగారు. అయినా కమలకు ఎప్పటి శ్రమా తగ్గలేదు. అలాగే తెరిపిలేకుండా ప్రైవేట్లూ చెపుతూనే ఉంది. రాత్రి రెడీమేడ్ దుస్తులకొట్లో పనిచేస్తూనే ఉంది ఉదయంవేళ కాలేజీ చదువులో మునిగిపోతోంది. ఎటువచ్చీ ఆమెకిప్పుడు వంటపని మాత్రం తప్పింది. వదినగారిప్పుడు కమలను గౌరవంగానే చూస్తోంది. భర్త ముందు వెనుకటిలా మాట్లాడలేక పోతోంది; చాటుగా సణుగుకోవడం తప్ప.

రెండో సంవత్సరంలో ఆరునెలల పరీక్షలు సమీపిస్తున్నాయని చదువు మరింత తీవ్రం చేసింది కమల. మంచినీళ్లు త్రాగి ప్రక్కగదిలోకి పోయి పుస్తకం చదువసాగింది. అప్పుడే బుచ్చివచ్చి ఆమె త్రాగిన గ్లాసుతోనే బిందెలో మంచినీళ్లు తీసుకొని త్రాగబోతూంటే సూర్యకాంతం పరుగెత్తుకు వచ్చి పిల్లవాడిమీద ఒక్కటి చరిచి "ఆ గ్లాసుతో త్రాగకే నీవు కూడా, రోగంవచ్చి చస్తావు. పిల్లలున్న యింట్లో కాస్త వేరుంచాలి. కాని నోరుకదపడానికి వీలులేదీ యింట్లో" అంది గొంతుక తగ్గించుకొనే కమల వింటుందేమో ననే భయంచేత. కాని కమల ఆమె మాటలు వింది. ఆమె చంటిపిల్ల చేతులో గ్లాసు లాగుకోవడం కూడా చాటునుంచి గమనించింది. ఒకక్షణం మామూలుగానే ఉందికాని వెంటనే వదినగారిమాటల అర్థం గ్రహించి హడలిపోయింది ఏమిటి తనకుకూడా వ్యాధి వస్తుందా? ఆమె గుండె అదిరిపడింది కాని మళ్ళీ ధైర్యం తెచ్చుకుంది. తనలో ఏమయినా ఉంటే ఈ పాటికే బయటపడును. అదేమీ లేదు. పైగా తనేమీ అశ్రద్ధ చేయలేదు కదా. వదినగారి స్వభావమే అంత ఆమె మాటలకు తానేమీ బెంగ పెట్టుకో నక్కర లేదనుకుంది. పుస్తకంమీదకు మళ్ళీ ధ్యానం పోనిచ్చింది. కాని తిరిగితిరిగి వదినగారిమాటలూ, బుచ్చిచేతిలో నుంచి గ్లాసు లాగుకోవడం జ్ఞాపకం రాసాగాయి. కాదనుకున్నా ఆందోళన తప్పలేదు. భర్త పడ్డబాధ జ్ఞాపకంవచ్చింది. తనకుకూడా అది వస్తుందా? తనుకూడా ఆనరకబాధ పడవలసి వస్తుందా ఏమిటి భగవంతుడాఅని తల్లడిల్లి పోయింది. అనేక రకాల ఆలోచనలు బయలుదేరి ఆ రాత్రి నిద్రే పట్టలేదు. తెల్లవారినతరువాత లోతుకు పోయిన ఆమె కళ్లు చూసి "అమ్మాయీ అలా ఉన్నావేం" అని అడిగాడు గోపాలం. "ఏమీ లేదు రాత్రి ఎందుకో సరిగా నిద్ర పట్టలేదని" తప్పించుకుంది కమల.

సందేహం పీకుతూనే ఉంది ఆమె మనసులో. కాలేజీవేళ అయింది. డాక్టరు దగ్గరకు వెళ్దామా వద్దా. వెళ్లితే ఏమి చెప్తాడో, ఏమి వినవలసి వస్తుందో అనే భయంతో ముందువెనుక లాడుతూ కాలేజీకే పోవడానికి సిటీబస్సు ఎక్కింది. మరుక్షణం దిగిపోయి డాక్టరు దగ్గరకు పోయింది. డాక్టరు ఆమె గుండె, నాడీ అవీ పరీక్ష చేసి రక్తం వగైరాలు పరీక్షకు తీసుకొని, ఎక్సరేలు కూడా తీయించాడు. మర్నాడు చెపుతానన్నాడు ఫలితం. అక్కడినుంచి కాలేజీకి వెళ్ళింది. కాని ఆమె మనస్సుకు శాంతి లేకపోయింది. తీర్పు విననున్న ఖైదీలా మర్నాటికోసం అదురుతున్న గుండెతో ఎదురు చూసింది.

డాక్టరు కొంతసేపుండి "నీవింతగా భయపడవలసిన పనిలేదమ్మా. వెంటనే జాగ్రత్త తీసుకుంటే ఏమీ ప్రమాదంలేదు" అని అంటూండగానే కమల అలాగే కుర్చీలో కూలబడిపోయి ముఖం చేతుల్లో పెట్టుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది డాక్టరు లేచి వచ్చి "అంత భయమేమీ లేదని చెప్పాను గదమ్మా. నీ వ్యాధి ఇంకా ప్రారంభ దశలోనే ఉంది. ఈ దశలో వెంటనే చికిత్స చేయించుకుంటే వ్యాధి తగ్గకపోవడం అరుదు. నీకుకూడా తగ్గుతుందనే నా విశ్వాసం. వెంటనే మదనపల్లి శానిటోరియంలో చేరు. పూర్తిగా కోలుకుంటావు ఇంతకన్న ముదిరిన వ్యాధిగలవారే అక్కడ బాగుపడ్డారు. నీవు బాగుపడటానికి ఏమిటి?" అన్నాడు. కమలకు ఏడుపు తగ్గింది. కళ్లుతుడుచుకొని లేచి నిలబడింది. అలా డాక్టరుముందు తనురోదించడం ఆమెకు చాలాసిగ్గు కలిగించింది. తానీ మధ్య ఇట్టే ధైర్యం పోగొట్టుకుంటోంది. ధైర్యమవలంబించాలనుకొని డాక్టరు నడిగింది. "వెంటనే మదనపల్లి వెడితే నాకు తగ్గే అవకాశముంటుందంటారా?" అని. "తప్పక అవకాశముంటుందమ్మా. ఎప్పుడు వెళ్తావు, నేనక్కడి సూపరింటెండెంట్‌కు ఉత్తరం ఇస్తాన"న్నాడు ఆయన.

"ఈ వేళే వెళ్తాను మీరు ఉత్తరం రాసిఇస్తే" అంది కమల. డాక్టరు రెండుత్తరాలు రాసి, ఒకటి ఆమెకిచ్చి పట్టుకువెళ్ళమని చెప్పి, రెండోది తనే తిన్నగా పోస్టులో పంపుతానన్నాడు. కమల ఆయనకు ధన్యవాదాలు చెప్పి, ఫీజు చెల్లించి, ఇంటికి పోబుద్ధివేయక బ్యాంకుకు వెళ్ళింది. చదువు పూర్తిచేయడం కోసం ఉంచినడబ్బంతా తీసివేసుకొని తిన్నగా స్టేషనుకు పోయి బండి ఎక్కింది.

మదనపల్లి చేరుకున్నాక అన్నగారికి టెలిగ్రాం ఇచ్చింది తానక్కడ చేరానని. గోపాలం, సీతారామయ్యగారూ ఇద్దరూ పరుగెత్తుకువచ్చారు. "నాకేమీ భయంలేదు. పెద్దప్రమాదమేమీ లేదు. వెంటనే చికిత్స చేయించుకుంటే అనుమానంలేకుండా చేసుకోవచ్చని చేరా"నని చెప్పింది కమల. గోపాలం, సీతారామయ్యగార్లు చాలా ఆదుర్దాతో "జాగ్రత్తగా గడుపుకో అమ్మా, ఇట్టే ఇట్టే ఇంతదూరం రావడంకష్టమమ్మా. అంతగా అవసరమైతే 'వైరి' స్తే వెంటనే వచ్చివేస్తా"మని చెప్పి, ఆమెకు కావలసిన ఏర్పాట్లన్నీ చేసి వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు.

వాళ్లు వెళ్ళిపోయిన తరువాత కమల మళ్లీ ఒంటరితనం బాగా అనుభవించసాగింది. ఆ ఆసుపత్రిలో రోగులు ఎవరి మంచాలమీద వారుండి ఎవరిబాధల్లో వారు మునిగి ఉంటారు నర్సులు చాలా మంచివారు అయినా కమల బెంగపడసాగింది. రాత్రి వచ్చిందంటే మరీ భయంవేయసాగింది. ఆ నిశ్శబ్ద వాతావరణంలో గుండెలు ఛేదిస్తూ అప్పుడప్పుడొక్క దీర్ఘమైన మూలుగు, భయం

హోటల్లో కాఫీ తాగుతున్న ఆసామి సర్వర్‌ను పిలిచి: – "ఏమిటిది, ఇక్కడ కాఫీ కోకోవాసనేస్తోంది?"

"అరెరె. పొరబాటున టీ ఇచ్చినట్టున్నాను సార్."

* * *

"ఇదివరకు చేస్తున్న ఉద్యోగం ఎందుకు మానేశావ్ నువ్వు?"

"ఇష్టం లేక నేనండి."

"ఎందుచేత?"

"కారణం చెప్పలేదండి. ఊరికేనే, మాకు ఇష్టం లేదు, పొమ్మన్నారండి."

★

కరమైన, కఠోరమైన దగ్గు ధ్వని. కమల గుండె ఆరాటంతో తల్లడిల్లి పోసాగింది.

సాయంత్రం వేళ రోగుల బంధువులు వచ్చి తమవారిని చూసుకునేవారు. కాని తనను చూసేందుకు వచ్చేవారు దగ్గరలో లేరు. నర్సు మాత్రం సాయంత్రం ఆమెను 'వీల్ ఛెయిర్' లో కూర్చోబెట్టి బయటకు తోసుకుపోయి నీరెండలో నిల్పేది. కమల పరిసరప్రకృతిని చూసేది కాని ఆమె మనస్సు ఆందోళనతో సతమత మవుతోంది. స్నేహితురాళ్ళు, చుట్టాలూ, పరిచయస్థులు అందరినీ తలచుకునేది. వారందరూ పిల్లలతో భర్తలతో ప్రపంచంలోని సుఖాలనుభవిస్తూ ఉంటారు. కాని తనకు అన్నీ కష్టాలే వచ్చాయి. భర్త, ప్రేమ విలువ తెలుసుకున్నప్పుడే భగవంతుడు వేరు చేశాడు. ఇప్పుడు తనకుకూడా అతనికి వేసిన శిక్షే వేశాడు. అనుభవించి తీరవలసిందే. లోకంలో కొందరు ఏ పాపం చేయకపోయినా వారికి సుఖం అనుభవించే అదృష్టం పట్టదు. వారు పొందగలిగిన సుఖం ఇతరుల ప్రేమే. తనకూడా తన జీవితంలో సుఖం అనుభవించే అవకాశం లేకపోయినా కనీసం ఇతరుల ప్రేమాభిమానాలేనా చూరగొన గలిగింది. తనను బానిసగా చూడబోయిన భర్త తనను ప్రేమిస్తూనే ప్రాణం వదిలాడు. తనను వెళ్లగొట్టిన అన్నగారే తనను వెంబడించాడు. తన ననుమానించిన సుశీలే తనను స్నేహితురాలుగా భావిస్తోంది. ఇంతకన్న తనకేమి కావాలి? బ్రతికినా ఇందరి ప్రేమతో హాయిగా జీవించవచ్చు. పోయినా ఇందరి ప్రేమాభిమానాలకు పాత్రురాల నయ్యాననే సంతృప్తితో పోవచ్చు. ఈ ఆలోచనలతో ఆమె మనస్సుకు ఊరట లభించింది. బెంగ పోయింది. సంతోషం కూడా కలగసాగింది. జీవితం తిరిగి అంధకారమయంగా కాక ఆశామయంగాకూడా కనిపించింది.

ఆ క్షణంలో ఆమె కెందుకో పాడ బుద్ధి వేసింది. నర్సు నడిగింది: "నా కొక్క పాట పాడాలని ఉంది, సిస్టర్. పాడవచ్చా" అని. "పాడకూడదమ్మా. పాడితే అలసటవస్తుంది. అలసట కూడదన్నారు డాక్టరు అనక ఏమైనావస్తే డాక్టరు నన్ను కోపపడుతారు" అంది నర్సు. "కాదు సిస్టర్. ఈ ఒక్క రోజుకీ పాడనీయండి. పెద్ద ప్రమాదమేమీ రాద"ని బ్రతిమాలింది కమల. నర్సు చివరికి ఒప్పుకుంది. కమల పాడసాగింది. చిన్ననాడు తల్లి నేర్పినపాట అది. కాని పూర్తిగా పాడలేకపోయింది. అలసటవచ్చి సగంలోనే ఆపివేసింది. వెంటనే దగ్గుకూడా వచ్చింది. నర్సు: "అయ్యో చెపితే విన్నావు కాదమ్మా. డాక్టరు నన్ను చాలా కోప పడుతాడు, ఏం చేయను" అని తన విషయమే ఆలోచించుకుంటూ 'వీల్ చెయిర్' లోపలకు తీసుకు వచ్చివేసింది. 

[సమాప్తం.]

ఉష్ట్రపక్షులు ఇసుకలో తల దూర్చి, తాము ఎవ్వరికీ కనబడడం లేదనుకుంటాయి. ఒకసారి ఒక ఎడారిలో ఒక ఉష్ట్రపక్షి ఇంకొకదాన్ని ఏడిపించడానికి ఇసుకలో తలదూర్చింది. రెండోది దానికోసం పాపం ఆ ఎడారి అంతా వెదికింది. 

# బాలసాహితి

## బంగారు పిట్ట

అనగనగా ఒక రాజుగారు ఉండేవారు. ఆయనకి ఒక చక్కని తోట ఉంది. ఆ తోటలో ఒక మంచి ఆపిలుచెట్టు ఉంది. ఆ ఆపిలు చెట్టు బంగారు ఆపిలు పండ్లు కాసేది. రాజుగారు పాపం ఆ ఆపిలుపండ్లు తినాలని ఎంతో ఉబలాటపడేవాడు. కాని సరిగ్గా ఆపిలుపండు పండే సమయానికల్లా, అది రాత్రికి రాత్రే మాయమవుతుండేది. అందుచేత రాజుగారు తోటమాలిని రాత్రిళ్ళు కూడా చెట్టుకి కాపలా కాయమన్నారు.

వృద్ధుడైన ఆ తోటమాలి తను వెళ్ళటానికి బద్ధకించి, కాపలాకి తన పెద్దకొడుకు, భీముని పంపాడు. తోటమాలి పెద్దకొడుకు అర్ధరాత్రి అయ్యేసరికల్లా పాపం నిద్రపోయాడు. ఆ రాత్రి కూడా ఒక ఆపిలుపండు మాయమైంది. మర్నాడు తోటమాలి రెండో కొడుకు, సోము కాపలాకి వెళ్లి తన అన్నలాగే నిద్రపోయాడు. ఆవాళ కూడా మరొక పండు మాయమైంది. మూడోనాటి రాత్రి తోటమాలి మూడోకొడుకు, రాము తను కాపలాకి వెళతానని బయల్దేరాడు. "వద్దు నాయనా, నీవు వెళ్లవద్దు!" అన్నాడు తోటమాలి, తన చిన్నారి కొడుకుకి ఏదైనా కీడు సంభవిస్తుందని భయపడి.

కాని పట్టుదలగల రాము ఆ నాటిరాత్రి కాపలాకి పోయి మెలుకువగా చెట్టుక్రింద పడుకొన్నాడు. ఒక రాత్రివేళ ఏదో సుతిమెత్తని చప్పుడు విన్పించింది. ఇంతలో ఒక బంగారు పిట్ట అక్కడ వాలింది. అది ఒక ఆపిలుపండు ముక్కుతో పొడుస్తోంది. రాము వెంటనే గురి చూచి పిట్టమీదికి ఒక బాణం వదిలాడు. పిట్ట బాణపుదెబ్బ తప్పించుకుని ఎగిరిపోయింది. కాని పిట్ట ఈక ఒకటి క్రిందపడింది.

మర్నాడు రాము తెచ్చిన బంగారుపిట్ట ఈక చూచి రాజు ముచ్చటపడి, "నాకు ఆ బంగారు పిట్ట కావాలి. దాన్ని తెచ్చినవానికి నా రాజ్యంలో సగభాగం ఇస్తాను" అని ప్రకటించాడు.

* * *

బంగారుపిట్ట వెదికి పట్టుకు రావటానికి తోటమాలి పెద్దకొడుకు భీముడు అన్నిహంగులతో బయల్దేరి వెళ్లాడు.

బంగారుపిట్ట ఎక్కడ ఉంటుందో ఎవరికిమాత్రం ఏం తెలుసు? భీమూకి మాత్రం తెలుసా? తెలియదు. దారి తెన్నూ తెలియకుండా అతను ఉత్తరపు దిక్కుగా ప్రయాణించాడు.

కొద్దిరోజులకి అతడు ఒక అడవి చేరుకున్నాడు. అడవిగుండా పోతోంటే అతని కొక నక్క ఎదురైంది. అతడు ఆ నక్కను చంపటానికి విల్లు ఎక్కుపెట్టాడు.

అప్పుడు నక్క అందిగదా, "ఓ పిచ్చివాడా, ఆగు. నీకు నేను ఉపకారం చేయటానికి వచ్చాను. మరి నన్ను చంపుతావా?"

'నాకు బంగారుపిట్ట కావాలి. అదిఎక్కడుందో చెప్పు' అన్నాడు భీముడు.

"నువ్విప్పుడు తూర్పు దిక్కుగా నడక సాగించు. కొంతదూరం పోయాక, నీకు రెండు పూటకూళ్ళ యిండ్లు కనబడతాయి. అందులో ఒకటి చాలా సామాన్యంగాను ఎంతో నిరాడంబరంగానూ ఉంటుంది. అక్కడ నీకు రొట్టె కాసిని మంచినీళ్లు మాత్రం దొరుకుతాయి. దానికి ఎదురుగా వున్న పూటకూళ్ళ యిల్లు చాలా ఆడంబరంగా వుండి ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. అక్కడ నీకు ఖరీదుగల మంచి ఆహారం దొరుకుతుంది. త్రాగటానికి మద్యం కూడా ఉంటుంది. అక్కడ పోకిల్లా పురు

చావలి సాంబశివరావు

షులు త్రాగి తందనాలాడుతుంటారు. కాని నీవు ఆ పూటకూళ్లింటికి పోవద్దు. దానికి ఎదురుగా ఉండే నిరాడంబరమైన యింట్లోనే బస చేయి. ఆ యింటి ఆసామీ నీకు బంగారు పిట్ట జాడ చెపుతాడు." అని చెప్పింది నక్క. చెడ్డ స్వభావంకల భీముడు నక్కను చంపబోయాడు. కాని నక్క తప్పించుకొని పారిపోయింది.

నక్క చెప్పినవిధంగా భీముడు ఆ రెండు పూటకూళ్ళ యిండ్లవద్దకు చేరుకున్నాడు. నిరాడంబరంగా ఉన్న ఆపూరిగుడిసెలోకి వెళ్లటానికి మనస్కరించక, భీముడు దానికి ఎదురుగాఉన్న ఆకర్షణీయమైన భవనంలోకి దారి తీశాడు. అక్కడ సుష్టుగా తీయని పదార్థాలతో భోంచేసి, మద్యం తాగి, తను వచ్చిన పని మర్చిపోయి గాఢ నిద్రలో మునిగిపోయాడు భీముడు. మర్నాటినుంచి తన తల్లిదండ్రుల సంగతికూడా మరచిపోయి, అయోమయంగా అక్కడే తిని, త్రాగి, తందనాలాడుతూ ఉండిపోయాడు.

తోటమాలి రెండోకొడుకు సోము, అన్న జాడ తెలుసుకునేందుకు బయల్దేరి, సరిగ్గా మునుపు తన అన్న చేరుకున్న అడవి చేరాడు. అక్కడ అతనికి నక్క అగపడి, భీముడికి జరిగిన శాస్తి తెలియజెప్పి, "నీవైనా నా మాట విని ఆ పూరిగుడిసెలో బస చేయి. నీకు ఆ యింట్లోవాళ్లు బంగారుపిట్ట జాడ చెపుతారు. పిట్టను సంపాదించుకో!" అని హితబోధ చేసింది.

"సరే" అని సోము ఆ యిండ్లను చేరుకొన్నాడు. తన అన్నలాగే వ్యామోహంలో పడి, పూరి గుడిసెలోకి పోకుండా సుందరభవనంలోకి వెళ్లాడు. అక్కడ అన్నలాగే తాగి తందనాలాడటంలో మునిగిపోయాడు.

* * *

అన్నలకోసం వెదుకుతూ తోటమాలి మూడో కొడుకు రాము ఆ అడవిగుండా వెడుతున్నాడు. నక్క కనిపించింది. తన అన్నలాగా రాము నక్కను చంపటానికి యత్నించలేదు.

"ఓ అబ్బాయ్! మీ అన్నలు 'ఫలానా'చోట ఉన్నారు. నీవుగాని వాళ్ళని మంచి మార్గంలో పెడదామని ప్రయత్నించకు. ఎందుచేతనంటే, నీవు ఆ భవనంలో కాలు పెట్టితే నీవూ వాళ్ళలాగే సోమరివి త్రాగుబోతువి అవుతావు. కాబట్టి, నేను చెప్పినమాట విని ఆ భవనం వైపు కన్నెత్తి చూడకుండ దానికి ఎదురుగా ఉన్న పూరిగుడిసెలోనే బస చేసి, ఈ రాత్రి అక్కడే పడుకో. తెల్లవారి నేను నీకు బంగారుపిట్ట జాడ చెవుతాను." అని చెప్పింది నక్క రాముతో.

నక్క చెప్పిన ప్రకారం, రాము ఆ రాత్రి పూరిగుడిసెలోనే నిద్రించాడు. తెల్లవారుతూండగా నక్క వచ్చి రాముని లేపింది. "నువ్వు నా తోకమీద కూర్చో. నిన్ను నేను బంగారు పిట్టవద్దకు తీసుకుపోతాను" అంది. రాము అట్లాగే చేశాడు.

రంయ్‌మని పరుగెత్తి నక్క నిమిషంలోకి రామూని ఒక తోటలో దించింది. నక్క సలహా ననుసరించి రాము తోటమధ్య వున్న పొదరింట్లోకి జొరబడ్డాడు. అక్కడ, పాతబడిపోయి అందవికారంగాఉన్న ఒక పంజరంలో బంగారుపిట్ట ఉంది. ఆ పంజరం ప్రక్కనే మరొక బంగారు పంజరం తళతళ మెరుస్తూ ముచ్చట గొల్పుతోంది.

రాము బంగారు పిట్టని బంగారు పంజరంలో పెడదామనుకున్నాడు. కాని నక్క చెప్పింది: అట్లా చేస్తే తనకి అపాయం సంభవిస్తుందని. కాని అంత మంచి పిట్టని ఆ వెధవ పంజరంలో ఉంచటమా?

రాము పిట్టని బంగారుపంజరంలో పెట్టాడు. పిట్ట అదోరకంగా కూసింది. ఎక్కడ దాక్కొని ఉన్నారో ఏమో, వెంటనే ఓ పాతిక మంది సిపాయిలు రాముని చుట్టముట్టారు.

ఆ దేశపు రాజుగారి ఎదుట రాముని విచారణకు పెట్టేరు. చివరికి ఆ రాజుగారు ఒక షరతుమీద రాముని వదులుతామన్నారు. ఆ షరతు ఏమంటే: వాయువేగంతో పరిగెత్తే పంచకల్యాణిగుర్రాన్ని

"గ్రామ్యములకు, దేశ్యములకు భేదము వివరింపుము," అని పరీక్షాపత్రంలో ప్రశ్న.

దానికి ఒక విద్యార్థి సమాధానము:- "దేశ్యము లనగా ఇవి కొద్దిగానే యుండును. ఉదా: హిందూ దేశము, అమెరికా దేశము, ఆంధ్ర దేశము. గ్రామ్యము లనగా చాలా యుండును. ఉదా:- కంకిపాడు, పామర్రు, నందిగామ, జగ్గయ్యపేట మొదలైనవి."

చక రాము ఆ రాజుగారికి తెచ్చి యిస్తే, బంగారుపిట్టని అతనికి బహుమతిగా యిస్తారు. లేకపోతే అతన్ని చంపేస్తారు.

రాము విచారంగా ఉన్నాడు. నక్క అతన్ని రక్షించటానికి వచ్చింది.

"నా మాట విని నే చెప్పినట్లు చేస్తే, ఈ బాధ అంతా లేకపోను. సరే, అయిందేదో అయింది. యికనైనా జాగ్రత్తగా ఉండు. నా తోక మీద కూర్చో. నిన్ను పంచకల్యాణివద్దకు తీసుకుపోతాను." అంది నక్క. రాము సంతోషంగా నక్క తోకమీద కూర్చున్నాడు

కన్ను మూసి తెరిచేసరికల్లా నక్క ఒక గుర్రపుశాలవద్ద ఆగింది. గుర్రపుశాలలో ఒకమూల పంచకల్యాణిగుర్రం గడ్డి కొరుకుతోంది. అది రాత్రిసమయం కావటంచేత కాపలావాళ్లు నిద్రిస్తున్నారు.

నక్క సలహాప్రకారం రాము పంచకల్యాణిని సమీపించాడు. పంచకల్యాణి ఎంత అందంగా ఉందో దాని వీపుమీద వున్న జీను అంత అసహ్యంగా ఉంది—చిరిగిపోయి మురికితో. ప్రక్కన వున్న స్తంభానికి ఒక మంచి క్రొత్త జీను తగిలించివుంది. ఉత్సాహంతో రాము క్రొత్త జీను గుర్రంమీద వేశాడు. "పాత జీను తొలగించవద్దు" అని నక్క చెప్పిన మాట పాపం రాము మరచాడు. క్రొత్త జీను అలంకరించగానే పంచకల్యాణి తమాషాగా సకిలించింది. నిద్రిస్తున్న సిపాయిలు లేచారు. రామును బంధించి, తమ రాజువద్దకు తీసుకుపోయారు.

# కృష్ణవేణి

మధురాంతకం రాజారాం

బిరబిరా చరచరా ముందునకు సాగేవు
చివరకా మున్నీట మాయమైపోయేవు
పరుగు లిక చాలునే మా కృష్ణవేణి!
కరుణించవే మమ్ము నిత్యకల్యాణి!

తెలియదటవే నీకు మున్నొక్కనాడు
కలిమిలో పేరొందె మా తెలుగునాడు
తొలగిపోయిన వెనుక ఆ గొప్పసిరులు,
అలముకొన్నవి తల్లి చీకటుల తెరలు!

పారతంత్ర్యము బాపి మొన్న నేగదవే
స్వాతంత్ర్యభానుండు వెలుగసాగినది!
తనవారిమేలుకై నిన్ననే గదవే
తెనుగన్న వేరుకాపురము పెట్టినది!

ముంగారుపంటలో బంగారుసిరుల
సింగారములు మరల సంతరింపంగ
నిలిచాడు కార్యరంగమున నాంధ్రుడు
నిరుపమానందాన ఈవె! కేలూత!

భీమానదీ తుంగభద్రలం గూడి
భీషణార్భటులతో గట్టులనొరసి
ప్రవహించి జలధిపాలైన దిక చాలు
నవజీవనానంద, మొసగి మమ్మేలు!

రాజుగారు రాముని "నీకేం శిక్ష విధించ మంటావ్?" అన్నారు.

రాము మౌనం వహించాడు.

"సరే, నీకే శిక్షా వద్దుగాని మాకో ఉపకారం చేస్తే నిన్ను వదిలేస్తాము. అంతే కాదు - నువ్వు కోరిన 'పంచకల్యాణి'ని కూడా బహూకరిస్తాము......" అన్నాడు రాజు.

"ఏమిటి రాజా మీకు నేను చేయగల ఉపకారం!" అన్నాడు రాము.

"ఇక్కడికి పడమరదిశగా పోతే, సప్తసముద్రాల అవతల ఒక ఉద్యానవనం కన్పిస్తుంది. అందులో సుందరాంగియైన రాకుమారి ఉంటుంది. ఆమెని మాకు లభింపచేస్తే, మా పంచకల్యాణిని నీవు నిర

భ్యంతరంగా తీసుకోవచ్చు" అన్నాడు రాజు.

రాము నక్కతో "కర్తవ్యమేమిటని?" అడిగాడు.

"ఏముంది, నా తోకమీద కూర్చో" అన్నది నక్క.

నక్క, రాము సప్తసముద్రాలు దాటి ఉద్యానవనం చేరుకున్నారు.

ఉద్యానవనంలో రాకుమారి జలక్రీడ లాడుతోంది. రామును చూచి ఆమె మోహించింది. కొంత తడవు రామూ రాకుమారీ ఉద్యానవనంలో విహరించారు.

"మా రాజ్యానికి పోదామా?" అన్నాడు రాము.

"అలాగే" నన్నది రాకుమారి.

"పద—" అని ముందడుగేశాడు రాము.

"మా అమ్మా నాన్నల్ని చూచి వస్తాను" అంది రాకుమారి.

ఆమెను తల్లిదండ్రులవద్దకు పంపితే తనకి ప్రమాదమని నక్క చెప్పింది. అంచేత, "చెప్పక్కర్లేదులే, రా పోదాం" అన్నాడు రాము కఠినంగా.

రాకుమారివదనం వివర్ణమైంది. ఆమె కళ్లనుంచి కన్నీటి బిందువులు జలజలా రాలసాగాయి. రాము మనస్సు వెన్నవలె కరిగింది.

"సరే, నీ తల్లిదండ్రుల్ని చూచి త్వరగా రా" అని ఆమెను పంపాడు.

రాకుమారికోసం నిరీక్షిస్తున్న రాముని రాజభటులు చుట్టుముట్టి తమ రాజు ఎదుట నిలబెట్టారు.

"నువ్వు మా రాకుమారిని అపహరింప యత్నించావు. ఇది ఘోర నేరం. దీనికి మరణమే శిక్ష. కాని నిన్ను చూస్తే నాకు జాలి కలుగుతోంది. కాబట్టి నీకు కష్టమైన పని చెప్తున్నాను. విను...మా రాజ్యానికి తూర్పుగా ఒక పెద్దకొండ ఉంది. ఆ కొండ ఉండటంమూలంగా నేను ఉదయిస్తున్న సూర్యుణ్ణి చూడలేకపోతున్నాను. అడ్డుగా వున్న ఆ కొండని నీవు పెకలించి అవతల పెట్టు. నిన్ను వదిలేస్తాను. అంతే కాదు - నా కూతుర్ని నీకిచ్చి వివాహం చేస్తాను." అన్నాడు ఆ రాజు.

గొప్ప సమస్యే!

"ఏం చేయమంటావు మిత్రమా? నీమాట వినక చెడిపోయాను..." అన్నాడు రాము పశ్చాత్తాపంతో దీనంగా.

"పిచ్చివాడా, భయపడకు. ఈ రాత్రి హాయిగా నిద్రపో. ఆ పని అంతా నేను చూచుకుంటాలే" అంది నక్క.

ఆ రాత్రికి రాత్రే నక్క ఆ పెద్దకొండని అక్కడినుంచి తొలగించింది. రాము తెల్లవారి తన మిత్రుడు చేసిన సాహసకార్యం చూచి ఆశ్చర్యపోయాడు.

తను చెప్పిన పని అంత తేలిగ్గా నెరవేర్చిన రాముకి, రాజుగారు తన రాకుమారినిచ్చి వివాహం చేసి, ఎన్నో బహుమతులు కానుకలుగా యిచ్చి గౌరవంగా సాగనంపాడు.

* * *

రాము రాకుమారి, నక్కతోక

మీద కూర్చున్నారు. మహా వేగంతో నక్క పంచకల్యాణిఉన్న చోటికి వారిని చేర్చింది.

ఆ దేశపు రాజుగారితో, ఇదిగో మీరు కోరిన రాకుమారి!" అన్నాడు రాము.

రాకుమారి రాజుచెంత నిల్చుంది.

"పంచకల్యాణిని మీరు తీసుకోవచ్చు" అన్నాడు రాజు.

రాము పంచకల్యాణిమీదికి ఉరికి, చేయి అందించి రాకుమారిని తన గుర్రంమీదికి లాక్కున్నాడు. ఇక వాయువేగంతో పంచకల్యాణి దౌడు తీసింది.

రాము, రాకుమారీ, బంగారు పిట్ట ఉన్న స్థలానికి చేరుకున్నారు. ఆ దేశపు రాజుగారితో "ఇదిగోనండి, మీరు కోరిన పంచకళ్యాణి. బంగారుపిట్టని యిస్తారా?" అన్నాడు రాము.

రాము యింకా గుర్రం దిగలేదు.

"అలాగే" అన్నాడు రాజుగారు.

ఒక భటుడు బంగారుపిట్టని పంజరంతోసహా రాముకి అందించాడు.

పిట్టని అందుకుని "భల్!" అన్నాడు రాము.

దుమ్ము రేపుకుంటూ పంచకళ్యాణి గాలికంటే వేగంగా పరుగెత్తింది. ఈ ఉపాయమంతా ముందుగా నక్క రాముకి చెప్పింది. నక్క పాపం రాముకి చాలా సాయపడింది.

కొంతదూరం వచ్చాక రామూ రాకుమారీలు, నెమ్మదిగా నిర్భయుంగా స్వారిచేయసాగారు.

"మిత్రమా! యిక సెలవా?" అంది నక్క.

"వెళ్ళిరా మిత్రమా! నీ మేలు మరువలేను. నీ ఋణం నేను తీర్చుకోలేను" అన్నాడు రాము.

"ఎందుకు తీర్చుకోలేవూ? నేను కోరిన పని చేస్తావా?" అంది నక్క.

"ఏమిటి?" అన్నాడు రాము.

"నా కాళ్లు నీ ఖడ్గంతో నరికేయి" అంది నక్క.

"అమ్మో! అంత పని నేను చేయలేను. నా మిత్రునికి నేను కీడు చేయలేను" అన్నాడు రాము.

"సరే, వస్తాను" అని నక్క ఎక్కడికో వెళ్ళిపోయింది. పోతూ, "దారిలో నీవు నీ అన్నలను చేరదీయకు. చేరదీశావా, నీకు హాని తప్పదు. జాగ్రత్త!" అని రాముని హెచ్చరించింది.

రాము రాకుమారి కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ప్రయాణం చేస్తూ తమ దేశానికి వస్తూండగా, దారిలో ఆ రెండు పూటకూళ్ళ యిళ్లవద్దా, రాము అన్నలు గుర్తుపట్టలేనంతగా మారిపోయి బికారుల్లాగా తిరుగుతున్నారు. రాము వాళ్ళను గుర్తించి, జాలితలచి తనతో రమ్మన్నాడు. వాళ్లు రాముతో బయలుదేరారు.

కొంతదూరం వచ్చాక వాళ్ళకి దారిలో ఒక చిన్న సరస్సు తగిలింది రాముఅన్నలు అక్కడ ఆగి విశ్రాంతి తీసుకుందామన్నారు.

"నీ ప్రయాణంలో నీటిదరిగా నీవు ఆగవద్దు" అని నక్క సలహా యిచ్చి వుండటంచేత, రాము అక్కడ ఆగటానికి నిరాకరించాడు. కాని అన్నల బలవంతంమీద అతడు అక్కడ ఆగక తప్పలేదు.

ఆహారం తీసుకున్నతర్వాత అన్నదమ్ములు నీటికోసం సరస్సులో దిగారు. సమయం చూచి దుష్టులైన అన్నలిద్దరూ తమ తమ్ముని, రాముని, సరస్సులోకి త్రోశారు. రాము సరస్సులో పడిపోయాడు.

ఆ విధంగా తమ్మునికి హాని కలిగించిన అన్నలిద్దరూ రాకుమారితో పంచకల్యాణిమీద స్వారిచేసి తమ దేశం చేరుకున్నారు.

రాజుగారితో తామే అష్ట కష్టాలు పడి, బంగారుపిట్టను సాధించుకొచ్చామన్నారు.

రాజుగారు యిదంతా నమ్మి, వాళ్ళిద్దరికీ బ్రహ్మాండమైన సన్మానం జరిపి, వారికి తన రాజ్యంలో సగభాగం యిచ్చాడు.

అంతా బాగానే ఉంది. కాని పంచకల్యాణి ఆహారం ముట్టదు. రాకుమారి కన్నీటి కాలువకు అంతులేదు.

ఇదిట్లా ఉండగా అక్కడ సరస్సులోపడ్డ రాముని నక్క రక్షించింది. రాము తన మాటప్రకారం చేయనందుకు అతన్ని మంద

(49-వ పేజీ చూడండి)

# లక్ష్మణ గడ్డ

'ఎల్లోరా'

రాజమహేంద్రవరం మీదుగా గాని, నరసాపురం మీదుగా గాని, లేదా కోటిపల్లి మీదుగా గాని ఎటు వెళ్ళినా గోదావరి దాటవలసిందే! అలా దాటిన తరవాత తగిలే భూమినిగురించి చిత్రమైన కథ ఒకటి ఉంది!

అది రామాయణ కాలంనాటి గాథ!

"ఎలాగైతేనేం కైకేయి మాట నెగ్గింది! ఆమె దశరథునిచేత కోరిన కోరికలలో రాముని వనవాసం ఒక కోరిక!

మాట తప్పకుండా శ్రీరామచంద్రుడు నారబట్టలు కట్టుకొని తిన్నగా భార్యాసమేతంగా బయలుదేరాడు! వెంటనే లక్ష్మణుడు వెళ్లాడు. అలా అడవులూ, కొండలూ, గుట్టలూ దాటుకుంటూ కందమూల ఫలాలు తింటూ, చెట్ల నీడనే విశ్రాంతి తీసుకుంటూ నడక సాగించారు!

లక్ష్మణునికి అన్న శ్రీరాముని యందు ఎంతో ప్రేమ, భక్తి గౌరవమూను. సీతాదేవి ఎడల మరది లక్ష్మణునికున్న భక్తి అందరికీ తెలిసిందే కదా! అందుకే అలా నడిచి ప్రయాణం చేసేటప్పుడు వారికి సంబంధించిన ఒక మూట అటు అన్నగారుగాని, సీతాదేవిగాని మోయడం అతనికి యిష్టం లేదు! వారిమీద వుండే గౌరవభావంతో - వారిని పట్టుకోనివ్వకుండా ఎంత దూరమైనా అతడే మోసుకు వస్తూన్నాడు - ఇలాగుండగా - అన్న రాముడు-"లక్ష్మణా! ఎంత దూరమని నువ్వు ఈ బరువుని మోసుకు వస్తావు? నేను కొంచెం దూరం తీసుకు వస్తాను. తరవాత నువ్వే తీసుకు రావచ్చును-" అన్నాడు!

"అబ్బే! నువ్వు పట్టుకు రావడమేమిటి! ఒదిన, నువ్వు కబుర్లు చెప్పుకుంటూ ముందు నడవండి - ఈ మూట నేను మోయడం - నా మహాభాగ్యం!" అన్నాడు లక్ష్మణుడు.

సరే! అనుకొని రాములవారు ముందుకు నడక సాగించారు. అలా నడిచి తిన్నగా గోదావరిపాయ వశిష్ఠవద్దకు వచ్చారు. అంతవరకు శ్రీరామునియందు సీతయందు లక్ష్మణునికున్న భక్తి, ప్రేమ అప్రతిహతంగానే ఉన్నాయి!

వశిష్ఠానదిని దాటి మెల్లిగా ఇవతలకు చేరుకున్నారు- అదే ఈనాడు రాజవోలు తాలూకా ప్రాంతం అంటారు. రేవుదాటి అవతల అడుగు పెట్టగానే - అంతదాకా మూట మోసుకువస్తూన్న లక్ష్మణుడు - "అన్నా, రామచంద్రా! నువ్వు ఊరికే చేతులు ఊపుకుంటూ నడవడమేమిటి! - నేను ఈ మూట మోసుకురావడమేమిటి - బాగాలేదు - కొంతదూరం నువ్వు తీసుకురా!" అన్నాడు!

చాలా ఆశ్చర్యపోయాడు శ్రీరాముడు. అంతదాకా మోస్తానన్నా వద్దన్న లక్ష్మణుడు ఆ సమయంలో యిలా ఎందుకన్నాడా అని ఆలోచిస్తూ "సరే! మూట ఇలా ఇయ్యి!" - అని తీసుకొని - తిరిగి తిన్నగా నడక సాగించాడు!

తిరిగి అలా వెళ్ళగా, వెళ్ళగా గోదావరి మళ్లీ దాటవలసి వచ్చింది- ఆ గోదావరి దాటితే మొదట వచ్చేదే కోటిపల్లి! ఆ గోదావరిని దాటి - కోటిపల్లి గడ్డమీద అడుగు పెట్టారు. అంతదాకా మూటను మోసుకువస్తూన్నది శ్రీరాముడే!

గోదావరిదాటి కోటిపల్లి గడ్డ మీద అడుగుపెట్టిన క్షణంలోనే లక్ష్మణుడు "అన్నా! శ్రీరామచంద్రా! క్షమించు! మూట నువ్వు మోయడమేమిటి! పొరపాటు! ఇలా తే!" అని మూట తీసుకున్నాడు!

ఇది మరీ వింతగా, ఆశ్చర్యంగా తోచింది: ఏమిటి అక్కడ గోదావరి దాటినవెంటనే మూట నువ్వు మోయాలన్నాడు. ఇక్కడ గోదావరి దాటగానే నువ్వు మోయడం ఏమిటీ అంటున్నాడు అని ఆలోచించాడు!

"లక్ష్మణా! ఇది నీతప్పు కాదు! నిన్ను క్షమించడానికి! అటు గోదావరి అవతల మహాభక్తితో మూట నెత్తిని పెట్టుకొచ్చావు - ఇటు గోదావరి దాటిన తరవాత అంతభక్తితోను మూటను తీసుకున్నావు! దీనికంతకూ కారణం ఆ గడ్డలోనే ఉంది. ఇది నీతప్పు కాదు" అన్నాడు శ్రీరామచంద్రుడు!

నాటినుంచీ ఆ ప్రదేశం "లక్ష్మణ గడ్డ" - అని గొప్పపేరు పొందింది!





## బంగారు పిట్ట

(47- వ పేజి తరువాయి)

లించింది. రాముని తన తోకమీద కూర్చుండబెట్టుకుని, అతని దేశానికి సమీపంగా ఉన్న అడవిలో దించి, "ఇక నీవు క్షేమంగా నీ దేశానికి వెళ్లు. రాజుగారు నిన్ను ఆదరిస్తారు. సుఖంగా బ్రతుకు" అంది నక్క.

"నీ ఋణం వెయ్యి జన్మలెత్తినా తీర్చుకోలేను కదా!" అన్నాడు రాము.

"తీర్చుకోలేకేం? నా యందు నీకు నిజంగా స్నేహభావం వుంటే, నా కాళ్లు నరుకు. నాకదే చాలు" అంది నక్క.

విధి లేక రాము ఎలాగో నక్క కాళ్ళు నరికాడు.

విచిత్రం!

నక్క ఒక చక్కని రాకుమారుడుగా మారిపోయింది. ఆ రాకుమారు డెవరో కాదు—రాము వివాహమాడిన రాకుమారి అన్న! చిన్నతనంలో ఎప్పుడో తప్పిపోయి, శాపవశంచేత నక్కగా మారిపోయాడు. నేటికి శాపవిమోచన మైంది.

రాము తన బావమరిదితో తన దేశంలో అడుగుపెట్టాడు. వెంటనే రాకుమారి విచారం మానింది. పంచకల్యాణి ఆహారం ముట్ట నారంభించింది.

రాజుగారివద్దకు పోయి, జరిగినదంతా తూచా తప్పకుండా విన్నవించి, తనకు న్యాయం కలుగచేయవలసిందిగా ప్రార్థించాడు, రాము. రాజుగారు రాము అన్నలైన భీమూ సోమూలు చేసిన మోసం గ్రహించి వారలకు తగిన శిక్ష విధించాడు. రాముకు ఘన సన్మానం చేశాడు. తన రాజ్యంలో సగభాగం రాముకిచ్చి అతడిని ఎంతో గౌరవించాడు.

రాజ్యంతోను, రాకుమారితోను రాము సుఖంగా ఉన్నాడు.

బంగారు పిట్టతో ప్రొద్దుపుచ్చుతూ రాజు సుఖంగా ఉన్నాడు.

బంగారు ఆపిలు పండ్లను స్వేచ్ఛగా భక్షిస్తూ బంగారుపిట్ట కూడా సుఖంగా ఉంది.

—"గ్రిమ్స్ ఫేరీటేల్స్" ★

"మా నాన్నకి రానురాను మరీ మతిమరుపు ఎక్కువౌతోంది."

"ఏం?"

"ఏమో మరి. పొద్దున్న ఊరెడదామని స్టేషనుకు వెళ్లాడు. అప్పుడు జ్ఞాపకం వచ్చిందట ఇంటిదగ్గిర రిస్టువాచి మరిచిపోయినట్టు. మళ్లీ ఇంటికి వచ్చి వాచి తీసుకువెళ్లడానికి టైముందో లేదోనని చేతికి ఉన్న వాచి చూసుకుని, ఇం కా టైముందిలే అనుకుని ఇంటికి వచ్చాడు."



# తేలు బాధ

వీరయ్య, శేషయ్య, రామసుబ్బయ్య, లోకయ్య నలుగురు అన్నదమ్ములు. వీరంతా సమిష్టిగానే ఉన్నారు. పెద్దవాళ్లు ముగ్గురికీ పెళ్ళిళ్ళయ్యాయి వీరు తండ్రి మిగిల్చిన నాలు గెకరాల భూమినీ సమిష్టిగానే సేద్యం చేసుకొంటున్నారు.

అన్నదమ్ముల్లో చిన్నవాడైన లోకయ్య చిన్నప్పట్నుంచి, చదువూ, సంధ్యా లేక అల్లరిగానూ గారాబంగానూ పెరిగి పెద్దవాడయ్యేడు పని ఉన్నా, లేకపోయినా ఇంటిదగ్గిరే ఉండి అల్లరిచేస్తూ, పిల్లలతో ఆడుతూ కూర్చుండేవాడు, లోకయ్య

ఒకరోజున అన్నదమ్ములు లోకయ్యను కూడా పొలంలో పని చేయడానికి తీసుకపోయేరు. పొలంలో పని చాలా కష్టమనిపించింది లోకయ్యకు. అలాగే ఒక వారం రోజులు పని చేశాడు ఒక రోజున పొలంలో నడిచి వెసుతూంటే ఒక తుప్పప్రక్కనుంచి తేలు కుట్టింది "బాబోయ్" అని బాధపడుతూ లోకయ్య క్రింద పడ్డాడు. అన్నలు ఇంటికి పొమ్మన్నారు. "పోలేను, బాబోయ్" అన్నాడు లోకయ్య శేషయ్య తీసుకువెళ్ళి ఇంటిదగ్గిర పడేశాడు. లోకయ్యకు, ఆరాత్రి బాధ తగ్గడంచేత బాగానే నిద్రపట్టింది. పొద్దుట లేచాడు నిరసంగా ఉన్నాడు. ఆవేళ అందరితో బాటే పొలం వెళ్లలేదు లోకయ్య, తేలు బాధతో.

ఆవాళ తల్లిని "బస్తీకి పోతాను ఆటలాడే, మాటలాడే, పాటలాడే బొమ్మలు చూస్తాను, డబ్బు లియవే" అన్నాడు లోకయ్య

"నాదగ్గిరెక్కడిది? మీ అన్నల నడిగి పుచ్చుకొని వెళ్లు" అన్నది తల్లి.

"నువ్వివ్వకపోతే, ఆ నూతిలో పడతాను, పాపయ్యగారి నూతిలో" అని లోకయ్య పరుగెత్తాడు తల్లి కూడా ఏమవుతాడో నా కొడుకు అనే ఆత్రంతో వెనకనే వెళ్ళింది లోకయ్య నూతిదగ్గర ఉన్న ఒక పెద్దరాయి నూతిలో పడవేసి ఏం జరుగుతుందో అని ప్రక్కనున్న చెట్టెక్కి కూర్చున్నాడు

"అయ్యో! నాకొడుకు నూతిలో పడిపోయాడు! రండి బాబోయ్! తియ్యండి పైకి!" అని బిగ్గరగా గోల పెట్టసాగింది చుట్టుప్రక్కల జనమంతా పోగయ్యేరు. ఒకడు పొలంలో ఉన్న అన్నలకి కబురు చెప్పడానికి వెళ్లేడు వీళ్ళంతా నిచ్చెన తేసుకొని నూతిలోకి దిగేరు ఎక్కడా దొరకలేదు "నీ కొడుకు దీనిలో పడలేదు" అని చెప్పారు.

'అయ్యో బాబు! ఇలాగే వచ్చేడు, దీంట్లోనే పడ్డాడు"అన్నది తల్లి కొందరు "మాకు చప్పుడు వినిపించింది దీనిలోనే పడివుంటా" డన్నారు కొందరు "కూరుకుపోయేడేమో" నన్నారు నూతిలో దిగిన వాళ్లు "దీంట్లో పడలే" దన్నారు, కొందరు "అసలు కారణ మేమి" టన్నారు.

"అయ్యో! నా కొడుకా" అంటూ రాగాలు మొదలుపెట్టింది ఎలాగయితే ఆవిడని ఇంటికి చేర్చారు అన్నలుకూడా వచ్చేరు. వీడిజాడ లేదు చివరికి లోకయ్య ఈసా రేమంటుందో గదా! అడుగుదాం అనుకొని బయలుదేరాడు. పెద్దన్నకు సంగతంతా తెలిసింది. ఇంటికి చేరాడు లోకయ్య.

"అయితే ఈ సారిస్తావా? ఇయ్యవా?" అన్నాడు, లోకయ్య తల్లిని

"ఆ ఇస్తానుకా" అని ప్రళయ

ఓ. రాజా రామమోహనరావు

# తెలిసింది

వేమూరాజు నరసింహారావు

సాయంత్రం నాలుగున్నరకి చందూ బడినుంచి యింటికి రావడంతోటే, పుస్తకాల సంచీ మంచంమీద పడేశాడు. అమ్మ యింకా టిఫిన్ తయారుచేస్తోవుంది.

నాన్నగారి టేబుల్ ముందు కూర్చున్నాడు. ప్రక్కనే వున్న ఒక హైంటుతీసి, ఎర్ర సిరాలో కలంముంచి కాస్సేపు "అర్డర్లు" వేసేశాడు. అద్దుడు పాడ్‌తో ఒకసారి అద్ది, సరిచూసుకుని, సంతృప్తిపడ్డాడు. కుర్చీకి చేర్లబడి కూచుని, అలవాటుప్రకారం ఎడమ బొటనవ్రేలు నోట్లోకి పోనిచ్చాడు.

ఎడమ బొటనవ్రేలు చూడగానే ప్రొద్దుటి నొప్పి జ్ఞాపకం వచ్చింది. ఎప్పుడూ గోపన్నయ్య ముందుగా వచ్చి ఫ్రంట్ సీట్‌లో కూర్చుంటాడు వాడికి అది రిజర్వు అయినట్లుగా. అందుకని, యివాళ వాడికంటే ముందు తను వెళ్ళి ఫ్రంట్ సీట్ లో కూర్చుని, వాడు రాగానే తలుపు తీశాడు. అది హఠాత్తుగా పడిపోయింది. తనవేలు అందులో యిరుక్కుపోయి చాలా నొప్పెట్టింది. నెత్తురయితే రాలేదు కాని - గోపన్నయ్య కావాలని నొక్కేసివుంటాడు తన వేలుని. లేకపోతే తన వేలు పట్టుకుని వెంటనే ఎందుకు రాస్తాడు? చెల్లి తనేచూడకుండా తలుపు వేశానని తరవాత ఒప్పుకుందనుకో! అయితేమాత్రం? గోపిగాడే తన వేలు నొక్కించివుంటాడనే అనుమానం పోలేదు వాడికి తగినశాస్తి చెయ్యాలి.

ఆఁ - గోపన్నయ్య మొన్న రెండు పావురాల్ని తెచ్చి పెంచుతున్నాడు. ఒకటి తెల్లది. రెండవది గోధుమ రంగుది. ఒక కుండకు కన్నాలు పొడిచి అందులో వాటిని పెట్టి జాగ్రత్తగా పెంచుతున్నాడు. అందులో ఒకదాన్ని వదిలిపెట్టేస్తే సరి! తిక్క కుదురుతుంది అయ్యగారికి—లేకపోతే తన వేలు కారు తలుపులో పెట్టి ఎందుకు నొక్కించాలి?

వెంటనే లేచి, మేడమీదకు వెళ్ళి ఒక పావురాన్ని వదిలేసి వచ్చాడు. అమ్మదగ్గరకు వెళ్ళి, ఆమె యిచ్చిన టిఫిన్ తింటూ కూర్చున్నాడు.

అయిదయేటప్పటికల్లా నాన్నగారు, గోపిఅన్నయ్య వచ్చేశారు. వచ్చి రావడంతోటే తన పావురాల్ని పలకరించడంకోసం గోపీ మేడమీదకు వెళ్లాడు. నాన్నగారు, బట్టలు మార్చుకుంటున్నారు. చందూ గుండె దడదడలాడింది

గోపీ క్రిందకు రావడంతోటే "ఒరే, చందూ" అని పిల్చాడు.

"ఏంటన్నాయ్"అంటూ చందూ బయటికి ఏమీ తెలియనట్లువచ్చాడు.

"ఏరా, నా తెల్లపావురాన్ని ఎవరు వదిలిపెట్టేశారు?" అని అడిగాడు గోపీ

"ఏమో, నాకేం తెలుసు? దాన్ని

రుద్రుడిలా కర్ర తీసుకుని వచ్చాడు పెద్దన్న. నీ కింత పనిచేసినందుకు, చితక తన్నాడు. లోకయ్యకు ఇక్కడే కనబడింది బస్తీ.

మర్నాడు పొలంలోకి అంతా యథాప్రకారం వెళ్లేరు. ఇలా నాలుగు రోజులు గడిచాయి. ఒక రోజున టక్కరి లోకయ్యకు ధోంగ తేలు కుట్టింది. ఎడమకాలు పైకెత్తి క్రింద పడ్డాడు. ఇంటిదగ్గిర పడేశారు. అక్కడ యమబాధపడ్డ లోకయ్య ఇంటిదగ్గిర ఎడమకాలుకి కట్టుకట్టుకుని పడుకొన్నాడు. వర్షం రావడంచేత అంతా పొలం వెళ్ళకుండా వెనక్కి వచ్చేశారు. నిద్రపోతున్న లోకయ్యను చూసి ఆశ్చర్యపడ్డారు.

చిన్నన్న ఎడమకాలికట్టు విప్పి కుడికాలికి కట్టాడు. ప్రొద్దుటే లేచాడు లోకయ్య. "తేలుబాధ ఎలా వుందిరా" అని అడిగేరు. కుడికాలికట్టు చూసికొని కాలుపట్టుకొని "అయ్య బాబోయ్, తేలు బాధ"అని ఏడవడం మొదలుపెట్టాడు. అప్పుడు అర్థమయింది లోకయ్య బాధ అందరికీ. అందరూ ఒక్కసారి ఫక్కుమని నవ్వేరు. అందరిలోనూ చెప్పరాని సిగ్గు కల్గింది లోకయ్యకు, తన రహస్యం తెలిసిపోయినందుకు.

★

నా కాళ్లలో వదిలివెళ్లావా?"

'ఛప్, వెధవా' నా పావురాన్ని వదిలేసి సంగనాచికబుర్లు చెప్తున్నావా? ఒక్క తన్ను తంటినా చూడు—"

"అమ్మోయ్. గోపన్నయ్య తంతున్నాడేవ్." అని చందూ ఒక్క కేకపెట్టి రాగం లంకించుకున్నాడు. అమ్మ పరిగెత్తుకు వచ్చింది.

"ఏరా గోపీ, బుద్ధిలేదూ? చిన్నవాడితో ఏమిటి నీకు?"

"నా పావురాన్ని వదిలేశాడే అమ్మా వీడు!"

"అందుకని చిన్న వెధవని చేసి తంతావా ?

"నేను తన్నలేదే."

"తంతానన్నాడమ్మా" అన్నాడు చందూ.

"ఒరేయ్, నీకిన్నేళ్లు వచ్చాయ్, వాడికి జ్ఞానం లేకపోతే, నీకూ లేదా? వాడితో సమంగా దెబ్బలాడతావా? నీకు ఎప్పుడొస్తుందిరా బుద్ధి?" అని అమ్మ గోపీని కేకలేసింది.

"ఒరేయ్ చంతూ" అంటూ నాన్నగారు యివతలికి వచ్చారు.

"ఆ ఫైల్ మీద ఎర్ర సిరాతో గీతలు గిసిందెవడ్రా ?"

"నేను కాదు నాన్నా" అని కంగారుపడ్డాడు చందు.

"వెధవా! ఆఫీసు ఫైలుమీద ఎర్ర సిరాతో గీతలుగీసి పాడుచేసి, యింకా అబద్ధాలు కూడానా? వాడి పావురాన్ని వదిలేసి, పైగా కబుర్లు చెబుతున్నావా? అడ్డగాడిదలాగా వెధవపనులు చేసి, చిన్నవాడినని తప్పించుకుందామనుకున్నావా?" అని వాడి చెవులు పట్టుకుని, ఆఫీసు గదిలోకి తోసి, గదికి బయట గొళ్లెం పెట్టేశారు.

"చిన్న వెధవతో ఏమిటి పోనిద్దురూ" అని అమ్మ సర్దబోయింది.

"ఏయ్. నీకు తెలియదు ఊరుకో. చిన్నవాడు చిన్నవాడు అంటూ వాడిని గారంచేశావు. పెద్ద గాడిదలాగ తయారవుతున్నాడు వాడు. ఎవరన్నా వాడిమీదికి అన్యాయంగా ఎగబడితే చిన్నవాడని కాని, వీడు అడ్డమైన వెధవ పనులు చేస్తే చిన్నవాడినంటే... ఆ తలుపు గొళ్లెం నాకు తెలియకండా తీశారంటే చూడండి—"

అమ్మ మరి మాట్లాడలేదు. నాన్నగారికి కోపం వస్తే మరి తిరుగు లేదు.

చందూ లోపల ఏడ్చుకుంటూ, కాస్సేపు తలుపు దబదబా బాదాడు. ఇక చేసేది లేక ఏడుస్తూ, సోఫాలో పడుకుని నిద్రపోయాడు.

రాత్రి ఎనిమిదింటికి నాన్నగారు క్లబ్బునుంచి వచ్చారు. వస్తూనే, "చందూ ఏం చేస్తున్నాడు?" అన్నారు.

"ఏమో, ఆగదిలోనే ఉన్నాడు"

అమ్మ ముందు కొంచెం బాధపడినా తరువాత ఊరుకుంది. అప్పుడప్పుడు కొంచెం దార్లో పడేస్తేనే గాని, వాడికి పట్టపగ్గాలుండవు అనుకుంది.

ఆఫీసుగదితలుపులు తియ్యగానే, ఏడిచి చారలుకట్టివున్న ముఖంతో చందూ సోఫాలో నిద్రపోతూ కనిపించాడు. వాడిని చూడగానే నాన్నగారికి జాలేసింది.

"ఒరేయ్, గోపీ, వాడిని లేపి, ముఖం కడుక్కోమని చెప్పి, అన్నానికి రండి."

గోపీ వెళ్ళి చందూని లేపాడు. "ఊ-నేను రాను పో"అని కాస్సేపు గునిసి, తరువాత ముఖం కడుక్కుని అన్నందగ్గర మూతి ముడుచుకుని కూచున్నాడు.

"ఇంకెప్పుడు యిటువంటి వెధవ పనులు చెయ్యకేం" అని నవ్వుతూ నాన్నగారు అన్నారు.

చందూ యింకా మూతి బిగించాడు.

"ఊ, సరేలే, అన్నం తిను."

"నేను, తినను."

"ఏం, నిన్ను కొట్టారా, తిట్టారా! ఊరికేనే గదిలో పెట్టి

### తమాషాతైన రికార్డు

ఒక హాలీవుడ్ నటి, ఒక పత్రికావిలేఖరికి కబురంపింది.

"నా పెళ్ళిళ్ళు, విడాకుల రికార్డు కాస్తసంపాదించి పెట్టగలరా"అని ప్రాధేయపడింది.

"మీ కార్యదర్శి లేరా?" అన్నాడు విలేఖరి.

"దాంతోనే వచ్చింది చిక్కు. ఆవిడగారు రికార్డు సరిగ్గా ఉంచలేదు. ఇపుడున్న రికార్డు ప్రకారం నేను మొత్తం 5 సార్లు పెళ్లి చేసుకున్నట్లుంటే, విడాకులు మాత్రం ఏడు సార్లిచ్చినట్టుంది" అంది తార.

## సమస్యలతో రణం

**గతవారం సమస్యకు జవాబు**

చేప శరీరము పొడవు=X అం.

తోక పొడవు=Y అం.

అని అనుకుని లెక్క చేస్తే శరీరం పొడవు 16 అం॥ అనీ, తోక పొడవు 12॥ అనీ వస్తుంది.

చేప పొడవు=తల+శరీరము+తోక పొడవులు.

=4 అం+16అం+12 అం.

=32 అంగుళాలు.

గాల్లో పెట్టాం. అంతేగా?" అన్నాడు గోపీ.

"ఊహూఁ-నువ్వు గదిలో పెట్టింది కూడా - జైలులాగ నీకెలాగ ఉంటుందో!"

అవును పాపం! గదిలో పెట్టి గొళ్లెం వేస్తే, జైల్లోలాగ ఏమీ తోచదు. స్వతంత్రమే వుండదు. ఎన్ని ఉంటే ఏం? స్వతంత్రత లేకపోయాక? పాపం, ఆ పావురాలు ఆ కుండలో జైల్లోలాగానే ఖైదీజీవితం అనుభవిస్తున్నాయా? వాటికి మంచి తిండి పెట్టి, ఎంత మంచిగా చూస్తే మాత్రమేం? అవి ఎక్కడికి పోవాలనుకుంటే అక్కడకు వెళ్ళలేకపోయాక?

పాపం—అనుకున్నాడు గోపీ.



ఇన్నాళ్ళనుంచి అవి ఎంత బాధ పడ్డాయో. తెలిసో తెలియకో చందూ ఒకదానికి స్వాతంత్ర్యం ఇచ్చేశాడు. ఇక రెండోదానికి తాను ఇవ్వాలి. ఇకముందు ఎప్పుడూ ఏ జంతువునీ, పట్టి బంధించి పెంచకూడదు అని తీర్మానించుకున్నాడు గోపీ.

ఇట్లా అనుకోవడంతో తమ్ముడిమీద ప్రేమ ఎక్కువయింది గోపీకి.

"అన్నం త్వరగా తినెయ్యరా చందూ-సినిమాకి వెళ్దాం" అన్నాడు.

చందూకి అన్నయ్యమీద మంచి అభిప్రాయం కలిగింది. పాపం, తన వేలు పొద్దున్న కారు తలుపులో పడేసి చితక్కొట్టింది గోపన్నయ్య కాదు. తల్లి చూడకుండా వేశానని ఒప్పుకుందిగదా! అన్నయ్య చాలా మంచివాడు. సినిమాకి తీసికెళ్తాట్ట. పాపం, అన్నయ్య ప్రేమగా పెంచుతున్న పావురాన్ని వదిలేశాడు తను.

"అన్నయ్యా, ఇంకెప్పుడూ నీ పావురాన్ని వదిలెయ్యనురా!" అన్నాడు చందూ అన్నం తింటూ.

"నేనే దాన్ని వదిలేస్తాలేరా! పాపం! దాన్ని పట్టుకుని కట్టేస్తే పాపం వస్తుంది."

"ఏదో కుర్రతనం, తెలియక నా పైలుమీద గీతలు గీశాడు గాని, తెలిస్తే చేస్తాడా ఏమన్నా?" అంది అమ్మ.

"అవును లే-ఇంకెప్పుడూ అల్లా చెయ్యకేం నాన్నా!" అని నాన్నగారు అంటే—

"సరే" నని తల వూపాడు చందూ.

ఆ సాయంత్రం జరిగిన దాంతో, అమ్మకి చిన్నవాళ్ళయినా తప్పు చేసినప్పుడు కోపేసుకు రాకూడదనీ, వాళ్ళది తప్పైనప్పుడు దండించడానికి వెనుదియ్యకూడదనీ అనిపించింది. నాన్నగారికి అనవసరంగా చిన్న వెధవని ఏడిపించానే అనిపించింది. గోపీకి ప్రాణికోటికి తిండికంటే స్వేచ్ఛ ఎక్కువనీ, ఇంక ఏ జీవుల్నీ పట్టి బోనులో వుంచి పెంచకూడదనీ అనిపించింది. చందూకి పెద్దవాళ్ళ విషయాల్లో జోక్యం చేసుకోకూడదని, చేసుకుంటే చిన్నవాడయినా తిట్లు, తన్నులు తప్పవని తెలిసింది.




# కుటుంబబాధ్యతల విభాగము

తోటలో పనిచేస్తున్న వీరన్న, వచ్చిన ఆరునెలలకే చెవులకు పోగులు చేయించుకొన్నానని తెచ్చి చూపించాడు వీరన్న జీతము నెలకుపాతిక. పోగులక్రింద వ్యయము చేసింది నూరు రూపాయలు ఈఆరు నెలలనుంచీఅతడు ఏభైరూపాయలే తనక్రింద ఖర్చు పెట్టుకున్నాడు 'చాలా మంచిపని చేశావువీరన్నా'' అని మేము మెచ్చుకోగానే 'ఇంకో పోగులజత చేయించాలండి' అన్నాడు. 'ఇంకెవరికి?' అని అడిగితే తల వంచుకొని 'నా పెళ్ళాండి' అన్నాడు నవ్వుతూ. అతని దృఢసంకల్పానికి, నిగ్రహానికి ఆశ్చర్యము కలిగింది

తోటి నౌకర్లందరూ జీతము చేతిలో పడగానే, కనీసము ఒక్కసారయినా సినిమాకు వెళ్లేవారు ఏ విధముగానో సంపాదించి సిగరెట్లు బీడీలు తాగేవారు కాని వీరన్న వల అల్లుతూ మెట్లక్రిందే ఉండేవాడు ఇతర నౌకర్లతో కలసిమెలసి మాట్లాడినా, వాళ్లు చేసే ఖర్చులకు విమర్శించేవాడుకాదు అంతమాత్రముచేత అతడి మనసులో ఏమున్నదో తెలిసికోవటము సులభముగా వుండేది కాదు ఒక్కొక్క రాత్రి తోడి నౌకర్లు వాళ్ళ సంగతులన్నీ చెప్తుంటే ఆనందముతో కుతూహలముతో వినేవాడు. కాని తెల్లవారినప్పటినుంచీ తన మామూలు ధోరణే తప్ప మరొక ఆలోచనను రానిచ్చేవాడు కాదు ఈనిగ్రహముతోనే వీరన్న మరొక పోగులజత చేయించాడు తోడి నౌకరులందరూ వీరన్నకు జీవితములో బంగారుపోగులు తప్ప మరొక ప్రసక్తిలేదని పగలబడి నవ్వుతున్నారు.

వీరన్న చేయించుకున్నది బంగారు పోగులే - అయినా ఆ పోగులకొరకు అతడు ఒక పథకము సిద్ధము చేసుకున్నాడు తన సంకల్పము నెరవేరేవరకూ మనో నిగ్రహముతో దృఢనిశ్చయముతో మసలుకొన్నాడు. కార్యసిద్ధి అయిన తర్వాత అతడి ఆత్మ సంతృప్తి చెందింది దిగ్విజయం పొందినట్లుగా అతడికళ్లు ఆనందముతో మెరసిపోయాయి. ఈ వీరన్న పెళ్లిచేసుకొని పిల్లలతండ్రి అయినా, తన సహజ ధోరణిలోనే పథకాలు వేసుకొంటూ, సంసారము నిర్వహిస్తున్నాడు చూసేవాళ్ళకు అతడు "సదానంద మూర్తివలె కనబడుతాడు దానికి మూలకారణము చాలా చిన్నది— అతడి ఆశయాలు చాలా పరిమితమైనవి— అతడు తన కోరికలను నెరవేర్చుకోవటములోనే నిమగ్నుడవుతాడు నెరవేర్చుకోగలిగిన కోరికలనే సంకల్పిస్తాడు అందుకే అతడికా సంతృప్తి ఇదే కాబోలు—"తనకున్న అవకాశాలలో తన సంకల్పాన్ని నెరవేర్చుకోజాలిన వ్యక్తి, తన మనసును దానియందు లగ్నముచేసి కృతకృత్యుడవుతా"డని విజ్ఞులు అన్నది

పైది ఆశిక్షితుడూ అనాగరికుడూ అయిన నౌకరు వీరన్న చరిత్ర మనలో—కష్టపడి చెమటోడ్చి న్యాయముగా ద్రవ్యార్జన చేసేవారు అనేకులు వున్నారు వారిలో కొందరు స్వల్పమొత్తము ఆర్జించేవారు, పెద్ద మొత్తము ఆర్జించేవారూ వున్నారు ప్రభుత్వ కార్యాలయాలలో బాధ్యతతో ఆర్థిక పాలనచేసేవారు ఉన్నారు ఇళ్లూ, వాకిళ్లూ, భూములూ, వెండి, బంగారము, వస్త్రాలు మొదలైనవి వున్నవాళ్లూ వున్నారు ఇవేవీ లేనివారూ వున్నారు కాని అందరిలోనూ కొద్ది భేదముతో అసంతృప్తి కనబడుతునే వుంటుంది. విద్యాధికులూ అర్థశాస్త్రము తెలిసికొన్నవారూ అనేకులు వున్నారు కాని తమ ఆదాయాన్ని స్వకుటుంబములో వుచితరీతిని అంచనా వేసుకొని, సంసారాలను చక్కగా నిర్వహించుకొన్నవారు చాలా అరుదుగా కనిపిస్తున్నారు. ఆదాయము చూసుకోకే తిరకట్టుగా ఉంటాము

ఇల్లిందల సరస్వతీదేవి

కాని జీవితము నిత్య దారిద్ర్యముగా వుంటుంది.

దీనికి బాధ్యులు ఎవరని భర్తను ప్రశ్నించితే "తప్పంతా నా భార్యదండీ చాలా దుబారా చేస్తుంది. ఎంత చెప్పినా తెలియదు" అని అంటాడు. ఇంకొకరు "తప్పంతా మా పిల్లలదండీ. ఎంతడబ్బున్నా వాళ్ళ ఖర్చులకే చాలదు" అంటారు. మరొకరు "ఇదంతా మా నాన్నా అమ్మ చేసిన పనండీ! ఎప్పుడూ ఎవరినో ఒకరిని భోజనానికో కాఫీకో పిలుస్తూ వుంటారు. వాళ్ళకు పదిమంది వచ్చి యింట్లో వుంటేనే గాని తృప్తిగా వుండదు. ఎంత తెచ్చినా యీ సంతర్పణలకే సరిపోతోంది." "చూశారా! మా ఆవిడకు జబ్బుగా వుంది—క్షయ! మంచి వాతావరణమూ విశ్రాంతీ కావాలని వైద్యులంటారు. అదివరకు నేను మందు యిప్పించే స్థితిలో లేనని చెప్పటానికి కళ్ళనీళ్ళు వస్తున్నాయి'' అంటారు. ఇలాగ అనేక నిదర్శనాలు మనకు కలవర పెడుతూ ఉంటాయి.

ఇక భార్యలను పలుకరించిచూస్తే పరిస్థితులు మరీ అగాధంగా కనబడతాయి. 'వారికి ఇల్లూ వాకిలీ పట్టదండీ ఎదిగిన పిల్లలు కంటికి కనబడుతున్నా చూడనట్టే ఉంటారు. ఇంట్లో భార్యా పిల్లలు పస్తులున్నా, ఆయన సినీమాలూ పార్టీలూ తప్పవు. మగపిల్లవాడు వారాలు చేసుకొనయినా చదువుకుంటాడు కాని ఆడపిల్ల గతి ఎట్లా?' అని ఒక ఇల్లాలు విచారపడుతుంది. ఒక గృహిణి, 'అవును! ఆయనకు పట్టని సంసారము నాకేనా పట్టేది? ఈ పిల్లకు ఎట్లా పెళ్ళి చేస్తారో చేయనీ ఆయనకు క్లబ్బులూ పార్టీలూ ఉంటే నాకుమాత్రం లేవా? పిల్లల బాధ్యత ఒక్క తల్లికేనా ఏమిటి?' అంటుంది. ఈ పక్షాన్ని విచారించిన తరువాత 'ఏది నిజము?' అన్న సందేహము మనకు కలుగుతుంది.

భార్యాభర్తలకూ పిల్లలకూ వృద్ధులకూ సంసారముపట్ల అసంతృప్తే. దీనికంతకూ కారణము ఏదని నిర్ణయించటానికి వీలు?

ఇంత సంపాదించినా ఒక మంచి సూటు కుట్టించుకోవటానికి వీలు కావటములేదని గృహస్థు అనుకుంటాడు. ఒక పట్టుచీర కొనుక్కోలేక పోతున్నానని ఇల్లాలనుకుంటుంది. అబ్బాయి కలము లేదనుకొంటే అమ్మాయి గడియారము లేదనుకొని చిన్నబోతుంది. ఈ విధముగా ఏ స్థితిలో ఉన్న సంసారము ఆ స్థితికి తగినట్టుగానే కించపడుతూ ఉంటుంది.

'వివాహము చేసుకొని గృహస్థాశ్రమములో ప్రవేశించటానికి నా ఆదాయము సరిపోతుందా?' అని పాశ్చాత్య దేశాలలో యువకులు తమలో తాము ప్రశ్నించుకుంటారు. మన దేశములో ఈ ప్రశ్న విద్యాధిక్యతగల యువక సమాజములో కొంత వరకూ సంచరిస్తూ ఉన్నది.. మిగతా సమాజములో మానవుడికి జీవితములో వివాహము ప్రధాన విషయముగానే ఎంచబడ్డది. చదువులో వెనుకబడిన యువకుడికయినా విధిగా వివాహము చేయుటము ఆచారముగా కనబడుతున్నది. కలిగిన దానిలోనే కలోగంజో తాగి స్త్రీపురుషులు జీవించాలని సమాజము నిర్ణయించింది.

క్రొత్తగా వివాహమయిన దంపతులు సంసార నిర్వహణకు పూనుకొనే ముందర అనేక ఆశలతో, ఆశయాలతో, మధుర స్వప్నాలను కంటూ ఉంటారు. నాగరికత ప్రబలుతున్న ఈ కాలములో జీవితావసరాలు పెరిగిపోయి జీవిత ప్రమాణము హెచ్చిపోయింది. ఏది లేకపోయినా దినము వెళ్ళనట్టే ఉంటుంది.

'మనము తీసుకోబోయే ఇంట్లో ఒక చిన్న రేడియో పెట్టుకోవాలండీ. నాకు సంగీతమంటే చాలా ప్రీతి' అని ఆమె అంటే, 'అవును. నాకూ సంగీతమంటే ఇష్టమే. కాని అంతకంటె ప్రసంగాలమీద నాటికలమీద అభిమానము ఎక్కువ' అని అతడు ఆమె వాదాన్ని సమర్థిస్తాడు.

ఇంటికి ఎవరు వచ్చినా మంచి కుర్చీలు లేనిదే బాగుండదు. కనీసము నాలుగు కుర్చీలు వాటికి మధ్యగాను ప్రక్కలకూ పెట్టటానికి చిన్న చిన్న బల్లలు కూడా అవసరమే. ఏమంటారు?' అని ఆమె ఆయనను సలహా అడిగినట్లూ తన కోరికను వెలిబుచ్చినట్లూ కాకుండా వ్యక్తపరుస్తుంది. 'అవును. అవి ముఖ్యముగా కావలసినవే. నేలమీద పరవటానికి ఒక జంపఖానాగాని, తివాచీగాని ఉండాలి' అని అతడు పై తీర్మానాన్ని బలపరుస్తాడు.

ఇలాగే ప్రతిదంపతులు తమ సంసారానికి కావాలనుకొన్న వస్తువులను వర్ణించుకుంటూ గుణించుకొంటూ కలలు కంటారు. ప్రారంభములో ఉత్సాహముకొద్దీ అతడూ ఆమె కూడా కొన్నిటిని కొనాలనే ప్రయత్నిస్తారు. సాహసించి కొనటము జరిగినట్లయితే దెబ్బతినటము కూడా సంభవిస్తూ ఉంటుంది. కొంత కాలమయిన తరువాత జీవితములో కలిగిన నైరాశ్యమువల్ల విసుగు, ఇతరులమీద అసూయ మొదలైన దుర్గుణాలు అంకురించటానికి అవకాశము కలుగుతుంది. కాని దీనికి వెరచి సాధ్యముకాని వాటిని, తమకు మించిన వాటిని కొనడానికి వీలు అవుతుందా? అయినా కొందరు తమస్థితిగతులకు తగిన వస్తుసామగ్రి కొనటానికే కృతనిశ్చయులవుతారు. అవన్నీ కొనటానికి అంత పైకము చేతిలో లేని పక్షములో, కావలసినవాటి నన్నిటినీ, కిస్తీలలో చెల్లించేటట్లు పూచీపడి కొంటారు. ఈ పద్ధతి అమెరికాలో ఎక్కువ ప్రచారములో వున్నది. మనదేశములో కూడా అక్కడక్కడ కనబడుతునే ఉంటున్నది. కొన్ని వస్తువులు కిస్తీలలో అమ్మబడితే తప్ప ఖర్చు కావు.

కారుకు కిస్తీ, రేడియోకు కిస్తీ బట్టలు కుట్టే మిషనుకు కిస్తీ, పంఖాకు కిస్తీ, కుర్చీలకు కిస్తీ—ఈ విధముగా అన్నిటికీ కిస్తీలను చెల్లించటములో కొంతకాలానికి ఆ వస్తువులయందు అభిమానము నశించిపోతుంది. అది ఒక బాధగా కనబడుతుంది. ఇటువంటి యాంత్రిక జీవితముమీద విరక్తోస్తుంది

## ముందు వెనకలు

కొత్తగా పెళ్ళయిన గోపాలరావుని, సంసారసారం ఆకళింపు చేసుకున్న కుటుంబశాస్త్రిగారు పలకరించి కుశలం అడిగారు. మాటామంతీ సాగాక గోపాలరావు అనుకూల దాంపత్యానికి తను కనుగొన్న సూత్రం చెప్పాడు.

"నేను చేస్తున్న ప్రతి పనీ, బుర్రలో ఉన్న ప్రతి ఊహా మా ఆవిడకి చెప్తాను" అన్నాడు.

కుటుంబశాస్త్రి, కొంటెగా మందహాసం చేశాడు. "నాకా శ్రమ లేదు బాబూ. నా బుర్రలో ఊహాలన్నీ మా ఇంటిది నే చెప్పకుండానే పసిగట్టేస్తుంది. పోతే నేను చేసే ప్రతి పనిగురించీ ఆవిడకు భోగట్టా అందచెయ్యడానికి మా పిల్లలు, ఇరుగుపొరుగుల వారూ పూనుకున్నారు" అన్నాడు.

కోరుకొన్న వస్తువులతో స్వర్గసుఖ మనుభవిస్తామని ఆశించిన దంపతులకు ఎండమావులు ఎదురవుతాయి. మనకు సంసారములో ఎడతెగని సమస్యలతో కష్టపడేవారికంటె, ఈ విధముగా కష్టపడేవారిసంఖ్య అధికముగా కనబడుతుంది.

దంపతులిద్దరూ 'తాము డబ్బు వాడినట్లయితే జాగ్రత్తగా ఖర్చుపెట్టటము జరుగుతుంది' అని వారిలో వారు అనుకోవటము సామాన్యము. 'ఆడవాళ్ల చేతికి ఎంత యిచ్చినా ఇంటిక్రింద ఖర్చు అయిపోతుంది. నేను భీమాకంపెనీకి కిస్తీ చెల్లించాలి. కోఆపరేటివు సొసైటీకి చెల్లించాలి' అని భర్తలు వాదించుకొంటూ ఉంటారు.

ఈ సమస్యలూ బాధ్యతలూ మారుతూ ఉంటే మనసు కలవరపడిపోవటము సహజము. అన్నిఖర్చులూ తానే నిర్వహిస్తానని బాధ్యత వహించిన గృహిణి, సమయానికి భీమాకంపెనీకి కిస్తీ చెల్లించలేకపోతే ఇబ్బందే కలుగుతుంది. కనుక ఇటువంటి బజారుపనులు పురుషులు చూస్తేనే మెరుగు. అసలు-ఆదాయానికి తగినట్లు అవసరాలకు సరిపడిన మొత్తాన్ని,గృహిణిచేతిలో పెట్టి సంసారాన్ని నిర్వహించవలసినదని పురుషుడు అనటములో కొన్ని లాభాలు కనపడకపోవు; తనచేతిలో ఉన్న మొత్తాన్ని భీమాకంపెనీలకు కట్టినా, బ్యాంకులకు కట్టినా, పెద్ద ఖర్చులకని నిలువచేసినా, అదనపు ఖర్చులకని ప్రత్యేకించినా ఉచితముగా ఉంటుంది. ఈ విషయాలలో అతడు తన కనుకూలమయిన పథకాలను అన్వేషించటానికి వీలుగా కూడా ఉంటుంది. గృహబాధ్యత కొంతవరకూ తగ్గటమువల్ల భారము తగ్గినట్లు ఉంటుంది.

గృహిణిచేతికి డబ్బు యివ్వటానికి చాలామందికి మనసు ఒప్పదు. ఒకవేళ ఇచ్చినా అడుగడుక్కూ పైసపైసకూ లెక్క చెప్పమని నిలవదీస్తూ ఉంటారు. భర్త విశ్వాసానికి పాత్రురాలయిన స్త్రీకి, డబ్బు యిచ్చిన పురుషుడు మోసానికి గురికాడు. స్త్రీకి అధికారముతోపాటు బాధ్యత కూడా అప్పగించి చూచినట్లయితే సామర్థ్యముతో నిర్వహించగలదని గ్రహించగలడు.

గృహిణి అయినా గృహస్థుఅయినా తమ చేతిలోఉన్న మొత్తాన్నిబట్టి, తమ అవసరాలను తగ్గించుకోవటానికి ప్రయత్నాలు చేస్తూనే ఉంటారు. అవిధముగా చేయలేనివాళ్లయినా ఈసూత్రాన్ని ఒప్పుకుంటూనే ఉంటారు. ఇంటిఖర్చులకని కొంత పైకాన్ని ప్రత్యేకముగా తీసుకొన్న గృహిణి, మామూలు అవసరాలను గడుపగలుగుతుంది. కాని ఆమె బాధ్యతమీద నిర్వహింపబడే సంసారములో, పొదుపుసూత్రాలను కొన్నిటిని అమలుపరచవలెనంటే కొంత మొత్తము విడిగా చేతిలో ఉండటము అవసరము. ఆమొత్తము ఉన్నట్లయితే, ఆమె వంటయింటి సామానులు, చవుకగా లభించే ఋతువులలో కొని, నిలువచేసుకొనగలదు. తలవని తలంపుగా వచ్చిపోయే బంధువుల తాకిడిని భరించుకొనగలుగుతుంది. వంటయింటి సామానులు అవసరము పడినప్పుడు బాగుచేయించటమో తిరిగి కొనటమో చేయటానికి ఆమెకు వీలవుతుంది.

నెలకు మూడువందల రూపాయల ఆదాయముగల గృహస్థు పట్టణవాసములో కాపురము చేయవలసివస్తే, ఆ గృహిణి నెలకు కనీసము ఆరు రూపాయలయినా చాకలి ఖర్చును భరించవలసే ఉంటుంది కొంతకాలానికి ఆగృహిణికి చాకలివాడికి బట్టలు వేయటమువల్ల త్వరగా చినిగిపోతున్నాయి. అదిగాక సమయానికి అందటములేదు కనుక ఇస్త్రీ పెట్టె కొనుక్కోవటమే సుఖము' అని భావిస్తుంది. ఈ విధముగానే పిల్లలకు తమకు కావలసిన బట్టలు ఏడాదికొకసారి కొన్నట్లయితే చాలా అనుకూలముగా ఉంటుందని నిశ్చయించుకుంటుంది. కాని ఆమె చేతిలో వీటికి సరిపడినంత మొత్తము ఉండదు. కుటుంబావసరాలకు ఖర్చుకాగా చాలా స్వల్పముగా మిగులుతుంది. ప్రతి నెలకూ మిగిలిన మొత్తాన్ని చేర్చి, తగినంత సమకూడగానే ఉపయోగించుకోవటము ఉచితమూ అద్భుతమూను. కాని ఈ పద్ధతి అందరికీ అనుకూలించదు. కావలసిన మొత్తము సమకూడకముందే ఖర్చు కావటము సంభవిస్తుంది. ఎంత ప్రయత్నించినా ఆ ఖర్చులను గృహిణి ఆపలేదు. దీనితో ఎంత కష్టపడినా తన సంకల్పము నెరవేరలేదని గృహిణికి ఒక విధమైన అసంతృప్తి బయలుదేరుతుంది. దీనికి ఇంటిలో ఉన్న వారంతా కారకులని ఆమె సంశయించే ప్రమాదమున్నది.

కాని యీ విధమైన సమస్యలను లోకజ్ఞానముగల గృహిణులు పరిష్కారము చేసుకోగలరు. గృహిణులు సహకార సంస్థలను నెలకొల్పవచ్చు. దానిలో వారి శక్తికి తగినట్టుగా మాసమున కింత అని నిర్ణయించుకొని నిలువ చేసుకొనవచ్చు. అవసరము కలిగినప్పుడు తమ వంతు వాటాను అప్పుగా తీసుకొని ప్రతి మాసమూ తిరిగి చెల్లించవచ్చు. ఈ రకములో చేరినదే చిట్ ఫండు అన్నదికూడా. దీనిని, ఒక సంవత్సరము వరకుగాని అంతకు తక్కువ కాలము వరకూగాని ఏర్పరచుకోవచ్చు. లేక మూడు నాలుగు సంవత్సరాల వరకూగాని దీనిని నిర్ణయించవచ్చును. పన్నెండుమంది సభ్యురాండ్రు పాతికరూపాయల వంతున రుసుము చెల్లించి ప్రారంభించినట్లయితే ఈ పన్నెండు మందికీ క్రమముగా పన్నెండు నెలల కాలములో మూడువందల రూపాయలు ఒక్కసారి చేతి కందుతాయి. దీనిలో కొంతమంది నూటికింత అని వడ్డీని వేలము పాటపాడే వరకు పెట్టుకొంటారు. ఈ పద్ధతివల్ల ఇతర సభ్యులు, తమకు అవసరము లేకపోయినా, వడ్డీ పెంచటానికిగాను పాడే అవకాశము ఉన్నది. దీనివల్ల సహకారసంస్థయొక్క సుహృద్భావము నశించి కక్షలకు అవకాశము ఏర్పడవచ్చు. కనుక అందరిపేర్లు వ్రాసిన చీటీలను, లాటరీ మాదిరిగా కళ్లు మూసుకొని చేతికందిన ఒక దానిని తీసి, ఆ పేరు గల సభ్యురాలికి ఆ మొత్తము ఇవ్వటమే ఉత్తమము. ఈ పద్ధతి తమిళదేశములో బహుళ ప్రచారములో ఉన్నది.

ఇటువంటివి ఏవి తలపెట్టినా సంసార సంబంధమైన మామూలు ఖర్చులకు లోటు రాకూడదు. కనుక గృహిణి తన సంసారావసరాలకు తగినట్టుగా ఒక పట్టికను సిద్ధము చేసుకోవాలి. ఆహారపదార్థాలకు పాలకు, చాకలికి, నౌకరుకు, పిల్లల పాఠశాలఖర్చు, వంటచెరకు మొదలైనవాటికి ఎంతవరకు వ్యయము చేయగలరో-ఎంతవరకూ తగ్గించటానికి వీలు కలుగుతుందో నిశ్చయించుకోవాలి. దానిననుసరించి నడచుకోవాలి. నెలనెలకూ కిస్తీల ప్రకారము చెల్లించి సమకూర్చిన సొమ్మును, సంకల్పించినదానికై వినియోగించాలి. ఈ విధముగా గృహిణి మనస్సు సంసార నిర్వహణ మీద, దానికనువయిన పథకాలమీద, కేంద్రీకరించబడినట్లయితే తన సంకల్పము నెరవేర్చుకోవటానికి ప్రయత్నించి కృతకృత్యురాలు కాగలదు. కార్యదక్షత నలవరచుకో గలదు. తనకు ఉన్న అవకాశాలకు శక్తిసామర్థ్యాలను జోడించి కృషి చేసిన గృహిణి కుటుంబ సౌభాగ్యాన్ని పెంపొందించగలదు. ఇంతకూ ఆమెలో ఏలోపము లేదు. ఆమె శక్తి సామర్థ్యాలు సద్వినియోగము కావటానికి తగిన అవకాశము కల్పించటములోనే అంతా ఉన్నది. దంపతులు కుటుంబ బాధ్యతలను పంచుకొన్నట్లయితే పోటీలో చక్కగా నిర్వహించ గలుగుతారు.






Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street. Madras-1. Editor S. Sambhu Prasad.

